# ఉత్తరగోపురము

[ నవల ]


గ్రంథకర్త:

ఉభయ భాషాప్రవీణ

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి






ప్రకాశకులు:

పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ.

# ఉత్తరగోపురము

[నవల]

గ్రంథకర్త:

ఉభయ భాషాప్రవీణ

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రి.




ప్రకాశకులు:

పి. ఆర్. అండ్ సన్సు, విజయవాడ.

# మున్నుడి

ఆంగ్లభాషయందుఁ బద్యరచనకువలె గద్యరచనకు సమ ప్రాధాన్య మీయఁబడుచుండును. అందు నవలలకు నధికగౌరవము గలదు. వారి నవలలు సాధారణముగా మానవుల యూహల కతీతములైన యభూతకల్పనలతో నిండియుండక, సంఘమున కాదర్శప్రాయములయిన నైసర్గికకథావస్తువులతో నలరారుచుండును. అట్టి నవలలు రచించినవారిలో స్కాటు, డికెన్సు ముఖ్యులు.

1789 వ సంవత్సరమునందు ఫ్రెంచివిప్లవము జరిగెను. దాని నాధారముగాఁ గైకొని పలువురు పలురచనలు గావించిరి. వారిలో చార్లెసుడికెన్సుపండితుఁ డొకఁడు. ఆయన రెండు పట్టణములకథ (Tale of Two Cities) వ్రాసెను. అది వాని రచనలలో నగ్రస్థానము వహించినది. ఆ నవల యందలి కథాంశమే యీ నవలకు మూలము.

ఇందలి కథకుఁ బారిసునగరములోని బాస్టిలు కారాగృహమునందలి యుత్తరగోపురము మూలరాయి. కావున దీని కీ పేరు పెట్టఁబడెను.

గ్రంథకర్త.

# ఉత్తరగోపురము

## ప్రథమ భాగము

### మొదటి ప్రకరణము

అది 1775 వ సంవత్సరము నవంబరు నెలయం దొక దినము. ఆకాశము మేఘావృతమైయుండెను. మంచు కురియు చుండెను. చలిగాలి తీవ్రముగా వీచుచుండెను. డోవరునగరము నందలి యొకపూటకూటియింటి కొక పెద్దమనుష్యుఁడు వచ్చెను. యౌవనవతియగు నొక యువతికి బసయేర్పాటు గావింపుమని పూటకూళ్లవాని కాజ్ఞాపించెను. అతనిపేరు జార్విస్ లారీ. లండనులోని టెల్సన్సుబ్యాంకున కొక ప్రధానోద్యోగి. ఆబ్యాంకునకు లండను పారిసు నగరములమధ్య వ్యాపార వ్యవహారములు గలవు. కొన్ని విషయములను జక్కఁపఱచుటకు బ్యాంకువా రాయన నొక వయోవతియగు యువతిని పారిసు నగరమునకుఁ గొనిపోవ నియమించిరి.

లారీ కొంచెముసేపు విశ్రమించెను. అంతలో నాయ నకు వీథియందు బండిచక్రముల యలికిడి వినిపించెను. ఒక సేవకుఁ డరుదెంచి "యయ్యా! యెవరో యొకనటి కన్యయట. టెల్సన్సు బ్యాంకునుండి వచ్చిన పెద్దమనుష్యునిఁ జూడఁ గోరు చుంటి"నని చెప్పుచున్న దని మనవిచేసెను.

లారీ సేవకునివెంట నామె గదియొద్ద కరిగెను. యౌవనవతియగు నొక కన్యక ద్వారమునొద్ద నిలుచుండి యాయన కొఱ కెదురు చూచుచుండెను. ఆమెకుఁ బదు నేడేం డ్లుండవచ్చును. అంత పొడగరియుఁగాదు, పొట్టిదియుఁ

గాదు. ప్రాయమునకు దగిన యాకారము. సుందరమగు రూపము. ఆమె శిరోజములు బంగారు వన్నెగలిగి నిగనిగ లాడు చుండెను. కనీనికలు విసీలద్యుతులను బ్రసరించుచుండెను. లారీ యామెవంకఁ బరిశీలించి చూచెను. తాను గొన్ని సంవత్సరములకుఁ బూర్వ మాంగ్లేయసముద్రముమీదఁ బ్రయాణ మొనరించుచుఁ దన చేతులలోఁ గొనివచ్చిన యొక శిశుమూర్తి కవళిక లామెయందు గోచరించెను.

మృదుమధుర కంఠస్వరముతో నామె "అయ్యా! యాపీఠ మలంకరింపుఁడని వినయపూర్వకముగాఁ బ్రార్థించెను. ఆమె యుచ్చారణ కొంచెము యాసగా నుండెను. కాని యది యంత పరిగణనీయముకాదు. లారీ పూర్వకాలపుమర్యాద ననుసరించి వినతుఁడై కూర్చుండెను. అప్పు డామె వానితో నిట్లనెను.

"అయ్యా! నాకు బ్యాంకునుండి యొక లేఖ వచ్చినది. అందు నా జనకుని యాస్తిపాస్తులను గూర్చి క్రొత్తగా నేదో యాచూకి తీయఁబడెనని కలదు. నా తండ్రి బహుకాలము క్రిందట మరణించెను. ఆయనను నే నెన్నడుఁ జూచియెఱుఁగను. అందుమూలమున నేను పారిసునగరమున కరుగవలసి వచ్చెను. అచటికి బ్యాంకునుండి యొక పెద్దమనుష్యుఁడు పంపఁబడును. ఆయనతో వ్యవహరింపవలసి యున్నది."

"ఆ పెద్దమనుష్యుఁడను నేనే" యని లారీ సమాధాన మొసఁగెను.

ఆ యువతి ప్రజ్ఞావంతుఁడును వయోవృద్ధుఁడు నగు నాయనకు మోకరించి వినతురాలయ్యెను. లారీ యామెకు మఱలఁ దలవంచి నమస్కరించెను.

బ్యాంకువారి కిట్లు సమాధానము వ్రాసితిని. "నేను ప్రాన్సునకుఁ బోవకతప్పదని నియమించితిరి. నేను మాతాపితృహీనురాలను. నాతో నరుదెంచు చుట్టపక్కములుగాని మిత్రులుగాని లేరు. మీరు పంపు గౌరవనీయుఁడగు పెద్దమనుష్యుని సంరక్షణముక్రిందఁ బ్రయాణ మొనరించుట కనుజ్ఞ యొసంగినచోఁ గృతజ్ఞురాలనగుదును."

"నా కీకృత్యము నియమించినందులకు సంతోషించుచుంటిని. దానిని నిర్వర్తించుటకు నాకు మఱింత సంతోషము" అని లారీ సమాధానము చెప్పెను.

"అయ్యా! కృతజ్ఞురాలను. నా యభివందనములు. బ్యాంకువారు నాతో "నా పెద్దమనుష్యుఁడు వ్యవహారములన్నియుఁ దెలుపఁగలఁడు. అది మీకు మిగుల నాశ్చర్యమొదవింపఁగలవు. వానిని ధైర్యముతో నాలించుటకు సంసిద్ధురాలనై యుండవలయు"నని నుడివిరి. అయ్యా! నే నన్నిటికిని సిద్ధముగానుంటిని. వానిని వినుటకుఁ గుతూహలపడుచుంటిని"

ఆమె కేమి సమాధానము చెప్పవలయునో లారీకి స్ఫురింపలేదు. తనకు నియమింపఁబడిన కార్యము నెట్లు బోధింపవలయునా యని యాలోచించుచుండెను. మానటికన్య హఠాత్తుగా నిట్లు ప్రశ్నించెను.

"అయ్యా! నన్ను మీ రెఱుగుదురా?"

లారీకిఁ దన కామెతోఁ గల పూర్వపరిచయమును వెల్లడించుట కిష్టములేదు. అతఁడు కథ నిట్లు ప్రారంభించెను.

"మానటీ! నేను వ్యాపారస్థుఁడను. నా వ్యాపార ధర్మమును నేను నిర్వర్తింపవలయును. నన్ను మానవ సహజములైన

దయాదాక్షిణ్యములు గలవానినిగాఁ దలంపకుము. మాటలు నేర్చిన యంత్రమని యూహింపుము. నిజమునకు నే నందరికంటె వేఱుకాదు. మా ఖాతాదారులలో నొకని కథను నీ కిపుడు చెప్పుచుంటిని."

"ఆయన పరాసు దేశీయుఁడగు నొక పెద్దమనుష్యుఁడు. ఆస్తిపాస్తులుగలవాఁడు. వైద్యుఁడు."

"బీవియసు గ్రామీయుఁడుకాఁడా?" యని మానటికన్య ప్రశ్నించెను.

"ఏల కాకూడదు? అవును. మీ జనకునివలెనే బీవియసు గ్రామవాసి. మీ తండ్రియగు మానటివలెనే యా గౌరవ నీయుఁడు ప్యారిసునగరమునందు విఖ్యాతినొందెను. నా కాయనతో నచటనే పరిచయము లభించినది. మా సంబంధములు వ్యాపార సంబంధములు. కాని యవి రహస్యములు. ఇది యిరువది సంవత్సరములక్రిందటిమాట. నే నప్పుడు పరాసు దేశమునందు శరణాలయములోఁ బనిచేయుచుంటిని."

"అతఁ డొక యాంగ్లేయయువతిని బరిణయమయ్యెను. నే నాయన సంరక్షకవర్గములో నొకఁడను. పరాసు దేశమునందలి చాలమంది పెద్దమనుష్యుల యొక్కయుఁ గుటుంబముల యొక్కయుఁ బరిస్థితులవలెనే యాయన వ్యవహారములు టెల్సన్సు బ్యాంకు నిర్వర్తించుచుండెను. ఇట్లే యేదో యొక రీతిగా నేను జాలమంది ఖాతాదారులకు సంరక్షకుడుగా నుంటిని. ఇవన్నియు వ్యవహార సంబంధములు. మానటీ! నాకు వారితో స్నేహముగాని, వారియందుఁ బ్రత్యేకమగు నాదరము గాని యేమియు లేదు. మా పరిచయములు నిమిత్తమాత్రములు.

మాావ్యాపారజీవితమునం దనుదినముఁ బెక్కు-మందితోఁ బరి చయము గలుగుచుండును. వారియెడ నాకే భావము లుండవు. నేను యంత్రమాత్రుఁడను."

మానటి లారీవంకఁ జూచెను.

"అయ్యా! యిది నాతండ్రి కథయని తలంతును. నా తండ్రి మరణానంతరము నాతల్లి రెండేండ్లుమాత్రముజీవించెను. అనాథనగు నన్ను మీరే యింగ్లాండునకుఁ గొని వచ్చితిరి. నిశ్చయముగా మీరే."

మానటి సందేహముతోఁ దనచేతిని ముందునకుఁ జాచెను. లారీ దానిని గైకొని పెదవులమీఁద నుంచుకొనెను.

"మానటి! నాకెట్టి తలంపులును లేవు. తోడి మానవు లతో నాకుఁగల సంబంధము వ్యాపారము. నేను నిన్నెన్నఁడుఁ జూచి యుండలేదనుటలో నన్ను గుఱించి నేను బలికిన మాటల యందలి సత్యమును నీ విప్పుడైనను గ్రహించి యుందువు. నాటినుండియు నీవు టెల్సన్సు గృహమునం దుంటివి. అప్పటి నుండియు నేను టెల్సన్సు గృహమునకు సంబంధించిన యితర కార్యములందు నిమగ్నుఁడనై యుంటిని. భావములా? వానికిఁ గాలముగాని సావకాశముగాని లేదు."

అతఁడు మఱల నిట్లు చెప్ప నారంభించెను.

"ఇంతవఱకు నీ వనినటులనే యిది నీ జనకుని కథ. ఇంక మీఁద వ్యత్యాసము కలదు. నీ తండ్రి మరణించెనని తలంచి నటుల మరణింపకుండినచో-భయపడకుము-ఎంత యులికిపడు చుంటివి!"

తండ్రి మరణించియుండకపోవచ్చునను తలంపు మాత్ర

మున కామె నిజముగా రిచ్చపాటు నొందెను. రెండుచేతులతో లారీ చేతులను గట్టిగాఁ బట్టుకొనెను.

"అమ్మా! ధైర్య మవలంబింపుము. ఇది వ్యాపార విషయము. నే ననినటుల మానటి మరణింపకుండెనేని- యతడు హఠాత్తుగా నదృశ్యుఁడయ్యెనేని-యత డే భయంకరప్రదేశము నందుండెనో గ్రహించుట సాధ్యము కాకుండినచో - మానవు నెంతకాలమైనను గారాగృహశిక్షకుఁ బాత్రుఁనిగాఁ జేయఁగల రిక్తతాక్షీదును బూరించు నధికారముగల విరోధి తనతోడి దేశీయులం దుండెనేని-ఆయనభార్య రాజదంపతులను, మంత్రులను, మతాచార్యులను నాయననుగూర్చి ప్రార్థించి వ్యర్థప్రయత్నురాలయినచో - నీజనకుని జీవితకథ బీవియస్గ్రామవాసియగు నా వైద్యుని కథయైయుండెడిది."

అయ్యా! మిమ్ము వేడుకొందును. తరువాతివృత్తాంతమును జెప్పుఁడు.

"తప్పక చెప్పుచుంటిని. నీవు సహనము వహింపుము."

"అయ్యా! నే నెట్టికష్టము నైనను సహించుకొనఁగలను. కాని యీ క్షణమునందలి సందేహసంఘటనము సహింపఁజాలకున్నాను."

"ఆ వైద్యునిభార్య తన భర్త యభాగ్యతనుగూర్చి మిగులఁ బరితపించుచుండ నామెకొక శిశువు జన్మించెను."

"అది యాడశిశువా?" యని మానటికన్య యాతురముతోఁ బ్రశ్నించెను.

"అవును. ఆడశిశువు. పాప మా యిల్లా లంతులేని మనోవేదన యనుభవించెను. హృదయవిదారకమగు నీ సందే

హామును దన కుమార్తెకుఁ దెలుపఁ దలంప లేదు. తండ్రి మర ణించెనను నమ్మక మొదవించుచు నా బిడ్డను బెంచుచుండెను. ఆమె నీతండ్రి సమాచార మెఱుంగకయే మరణించెను. అప్ప టికి నీవు రెండేండ్ల దానవు. నీ జనకుఁడు కారాగారమునందు మరణించెనో సజీవుఁడై యుండెనో యను సందేహమేఘములు నిన్నావరింపకుండ సౌఖ్యవతురాలవై సుందరాకారముతోఁ బెరిగి పెద్దదానవు కావలయునని యామె తలంపు.

నీ జననీ జనకు లధిక ధనసంపన్నులు కారని నీకుఁదెలి యును. ఉన్న కొలందియు నీకును నీ జననికి నొసఁగఁబడెను. క్రొత్తగా నా స్త్రీని గురించిన యాచూకి యేమియు లభింప లేదు."

మానటి లారీకరములను మఱింత గట్టిగాఁ బట్టుకొనెను. ఆమెకు భయము మిక్కుటమగుచుండెను. లారీ యది గ్రహించి తన కథనాపెను. ముందు రానున్న విషయములను గ్రహించు కొనిన కొలందియు నామె హృదయమున వేదనాతిశయము మితిమీఱి పోవుచుండెను. అది యామెకు భరింపరానిదయ్యెను.

లారీ కొంచెమాగి తనకథ నిట్లు మఱలఁ బ్రారంభించెను.

"కాని యతఁడుకనిపించెను. సజీవుఁడై యుండెను. రూప మధికముగా మాఱిపోయెను. అది సహజము. శల్యావశిష్టుఁడై యుండెను. అందు విపరీత మేమియు లేదు. ఎట్లుండిననేమి, యాయన జీవించియుండెను. పారిసులో నొక సేవకునింటికిఁ గొనిపోఁబడెను. మనమిప్పు డచ్చటికిఁ బోవుచుంటిమి. సాధ్య మగుచో నే నాతనిని గుర్తించుటకును, నీ వాతనిని బునర్జీవి తుని గావించుటకు, శాంతిసుఖముల నొదవించుటకు."

ఇప్పు డామె నడివయస్సునందున్న జనకుని యాకృతి

గాంచుటకు నోచుకొనలేదు. పదునెనిమిది సంవత్సరములు బాస్టలు కారాగారమున కఠినశిక్ష ననుభవించుటచేఁ జిక్కి-శల్యములు మిగిలియున్న యాతని భూతమును దర్శింప నరుగుచుండెను. ఆమాట తలంపునకుఁ బారి యామె శరీర మాపాద మస్తకము కంపించెను.

ఆమె స్వప్నలోకము నందుండెనెను. భయకంపితమగు హీనకంఠస్వరముతో నస్ఫుటముగా నిట్లనెను.

"నేను నా జనకు నరయ నరుగుటలేదు. ఆయన భూతమును జూడ నేగుచుంటిని."

లారీ యామె చేతులను బట్టుకొనెను.

"అమ్మా! నీకిప్పు డుత్తమాధమ పరిస్థితులనెల్ల నామూలాగ్రముగా నెఱింగించితిని. ప్రశాంతమగు సముద్రమునుదాటి భూమిపైఁ బయనించి నీజనకునిఁ జూడ నరుగుచుంటివి. ఆయన ప్రేమపార్శ్వమునం దచిరకాలములో నుండఁగలవు.

ఇంకొక విశేషమున్నది. ఆయన మఱియొక పేరుతో నుండెను. అసలుపేరు మఱచిపోయెను. అట్లుకానిచోఁ జాల కాలమునుండియుఁ గప్పిపెట్టఁబడెను. దానినిగూర్చి యాయనతోఁ బ్రసంగించుట నిరుపయోగము. ఆయన యింతకాలము ఖైదీగా నుంచఁబడెనో, లేక, యణచిపెట్టఁబడెనో యెఱుఁగుటకు యత్నించుటసైతము ముపయోగములేనిది. మన విచారణలు నిరర్థకములు. అపాయకరములు. ఈ విషయము లెచ్చట నెవరితోడ నేవిధమునను బ్రసంగింపక యుండుటమేలు. కొంత కాల మాయనను ఫ్రాన్సునుండి కొనిపోవుట యుక్తము. నే నాంగ్లేయుఁడను. టిల్సన్సు బ్యాంకునకుఁ జెందినవాఁడను. బ్యాంకు

ప్రభుత్వమున కప్పాలు పెట్టుచుండును. అట్లయ్యు నీ విషయ మెవరికో డను ముచ్చటింపక తప్పించుకొనుచుండును. నాకో నీ సంబంధమగు నెట్టి కాగితములను గొనిరా నిచ్చగింపను. ఇది యంతయుఁ బ్రత్యేకమగు రహస్యకార్యము. ఏమ ట్లుంటివి? నా మాటలు వినుచుండుట లేదా? మానటి! మానటి!"

మానటి మూర్ఛాగతురాలయ్యెను. ఆమెయందుఁ జైతన్యము నశించినది. మాటగాని పలుకుగాని నోటినుండి వెడలు చుండుట లేదు. ఆమెనూపులు లారీముఖమునందుఁ గేంద్రీభ వించి యుండెను. భయవేదనావేగచిహ్నములు ముఖము నందుఁ బ్రస్ఫుటముగా గోచరించుచుండెను.

---

## రెండవ ప్రకరణము

పారిసు నగరములోని సెయింటు ఆంటోని పరిసర ప్రదే శములం దెల్లెడలఁ జీకటు లావరించియుండును. అది శీతకాలము నందలి చీకటులవంటివి కావు. చలి, ముఱికి, రోగములు, నజ్ఞా నము భయంకరాకారములతో జీరాడుచుండును. ప్రతివీధి యందును బ్రతిముఖమునందును బ్రతియింటిలో నాకలిలేమి డులు పిలిచిన నోయని ప్రతిఘోషించుచుండును. అది దారిద్ర్య దేవతకు నాట్యరంగము. ఆశాపిశాచమునకు నివాసభూమి. మృత్యుదేవతకు నెలవు. అందొక సన్నని సందుమార్గము గలదు. అది నిరంతరము దుర్గంధభూయిష్ఠమయి యుండుచు. ఎడతెగని ఘాతుకకృత్యములకుఁ బెట్టినది పేరు. అందు గోచరించు

ప్రతివస్తువునందును క్రౌర్యము మూర్తీభవించుచుండును. అచటి జనులందు నడవిమృగముల ప్రకృతి మూర్తులఁ దాండవించుచుండును. వారందఱు బక్కచిక్కిన వారయ్యును నయనములందుఁ గోపాగ్నికి లోపములేదు. హంతకసాధనములు మారణయంత్రములు యుద్ధపరికరములు తయారుచేయుట వారిపని. కమ్మరివాని కత్తులందును గట్టెలుకొట్టువాని గొడ్డళులయందును నైశిత్యము నిగనిగలాడుచుండును. అచటి సమ్మెటలు బరువైనవి, తుపాకులు గుఱితప్పనివి.

ఆ వీథియందొకమూల పానశాల కలదు. అది తక్కిన దుకాణములకంటె మేలైనది. దాని యజమాని డిఫార్జి. వానికి దాదాపు ముప్పదియేండ్లుండవచ్చును. స్థూలమగు శరీరము. నల్లనిదేహచ్ఛాయ. కంఠ మాబోతుకంఠమువలె బలసియుండును. కన్నులు వికాసవంతములు. స్థిరమగు చిత్తము కలవాఁడు.

అప్పుడప్పుడే డిఫార్జి పానశాలలోని కరుదెంచెను. గళ్ళాపెట్టె వెనుక నాతని భార్య కూర్చుండెను. ఆమెశరీరము మిగుల స్థూలమైనది. కొంచె మించుమించుగా భర్తయీడుండవచ్చు. పొడుగుచేతులు. వానికి బరువగు నుంగరములు. తిన్నని ముఖము. బలిష్ఠమగు కాయము. ఆమె తీవ్రమగు దృష్టి యేవస్తువునైనను దేలికగా గ్రహింపఁగలదు. ఆమెను జూచిన వారందరు నామె యధికారమునందున్న ధన విషయము మాత్రము పొరపడనేర దని గ్రహించుకొనగలరు. ఆమె శైత్యముచే బాధపడుచుండెను. కావున నొకయున్నివస్త్రమును గప్పుకొనెను. బండిచక్రములవంటి చెవి పోగులు కనఁబడునటులఁ దల కున్నిగుడ్డను జుట్టుకొనెను. ఆమె యల్లుచున్న రుమా

లును బల్లపై నుంచి పల్లుకుట్టు పుల్లలుదీసెను. భర్త లోని కరుదెంచెను. ఆమె యేమియు మాట్లాడలేదు. కనుబొమలను పైకెత్తి యొకసారి దగ్గెను. అందొక విశేషార్థముకలదు. అతఁడు లేని సమయమునం దెవరైనను గ్రొత్తవా రరుదెంచిరేమో పరికింపుమని యామె ప్రబోధము.

డిఫార్జి పానశాలనలువైపులను బరికించెను. ఒక మూల నొక పెద్దమనుష్యుఁడు నాతని ప్రక్కన నొక యువతియు నతనికిఁ గనిపించిరి. మిగిలినవారిలో నిరువురు పేకాట నాడుచుండిరి. ఇరువురు చిత్తుబోకు లాడుచుండిరి. ముగ్గురు గళ్ళాపెట్టెయొద్ద నిలుచుండి ద్రాక్షారసమును సేవించుచుండిరి. డిఫార్జి గళ్ళాపెట్టె వెనుక కరుగుచుండెను. పెద్దమనుష్యుఁడు తన ప్రక్కనున్న యువతితో నతఁడే మనవాఁడని సంజ్ఞ చేసెను.

డిఫార్జి వారినిఁ జూడనటుల నటించెను. సారాను సేవించుచుండిన యా ముగ్గురితో నేదియో సంభాషించుచుండెను. కొంతసేపటికి వారు డబ్బు నిచ్చి వెడలిపోయిరి. ఆ పెద్దమనుష్యుఁడు జార్విసు లారి. అతఁడు ముందున కరుదెంచి పానశాలాధికారితో "అయ్యా! యొక మనవి. మీతో నొక మాట మాట్లాడవలయు" నని వచ్చితిని" అని నుడివెను.

"తప్పక మాట్లాడవచ్చు" నని డిఫార్జి యాయనతో ద్వారమువద్ద కరిగెను.

మొదటిమాటతోడనే డిఫార్జి యాశ్చర్య చకితుఁడై చెవి యొగ్గి యాలింప మొదలుపెట్టెను. వారిసంభాషణ క్షణములో ముగిసెను. అతఁడు శిరఃకంపము గావించి బైటికేగెను.

ఆ పెద్దమనుష్యుఁడు యువతికిఁ జేసంజ్ఞ గావించెను.

వారిరువురు పానశాలాధికారి నెంబడినరిగిరి. డిఫార్జిసతి సుస్థిరమగు కనుబొమలతో నల్లికను సాగించుచుండెను. ఆమె యీ విషయ మును బరిశీలింపలేదు.

లారీ మానటికన్యలు సారాదుకాణమునుండి నిర్గమించి పెరటిలోని కరిగిరి. అచట డిఫార్జిని గలసికొనిరి. అందనేక కుటీరములుగలవు. జనసమ్మర్ద మధికముగా నుండెను. ఆదారి చీకటి కోణము. అచటనుండియే మేడమీదికి మెట్లుగలవు. డిఫార్జి మోకరించి తన యజమానిపుత్రికయగు మానటికన్య కకు వినతుఁడయ్యెను. ఆమె చేతిని బెదవులపై నుంచుకొనెను. అట్లొనరించుటలో నతఁడు తీవ్రతను జూపెను. ముఖలక్షణ ములు క్షణములో మారిపోయెను. ప్రసన్న భావము నశించెను. కనులు రక్తారుణితము లయ్యెను. హృదయము కోపోద్దీపిత మయ్యెను. డిఫార్జి బాల్యమునందు మానటియింట సేవకుఁడు గాఁ బనిచేసెను. అతనిభార్య యొక కర్షకుని కుమార్తె. ఆమె సహోదరి దుర్మార్గుఁడగు నొక జమీందారునిచే నవమానింపఁ బడెను.

మానటి ధనికప్రభువుల క్రోధానలమున కకారణముగా గుఱియయ్యెను. పదునెనిమిదేడులు కారాగృహమున బంధింపఁ బడెను. శల్యావశిష్టుఁడై జీవితమునం దాశ వదలుకొనెను. అతని ప్రజ్ఞావివేకములు నశించెను. ముఖవికాసము తొలంగెను. వానిని దలంచుకొనిన మాత్రముననే డిఫార్జిదంపతుల హృదయ ముడుకెత్తిపోవుచుండెను. దుఃఖావేశములు పొడచూపు చుండెను. విప్లవభావము లంకురించి కుసుమితములగుచుండెను.

కడకెట్లో మానటి బంధవిముక్తుఁడయ్యెను. ఆయ

నను డిఫార్జిదంపతులు గొనివచ్చి యాశ్రయమొసంగి రక్షించుచుండిరి. జమీందారుల దుర్ణయమునకు గుఱియైన తనమిత్రుల కాయనను గాన్పించి వారి హృదయములందు విప్లవభావబీజములను నాటుచుండెను. ఆయనను వీక్షించినవారి చిత్తములు విషాదవిద్వేషములతో నుడికి విలయజ్వాలలను జ్వలింపఁజేయుచుండెను. లావాజలమువలె నుష్ణాశ్రువులు నయనములనుండి నిర్గతము లగుచుండెను.

"ఆయన యెప్పుడు నొంటరిగా నుండునా?" యని లారీ ప్రశ్నించెను.

"అవు"నని డిఫార్జి సమాధాన మొసఁగెను.

"అది యాయన కోరికయా?"

"అవసరము."

"మిగుల మాఱిపోయెనా?"

"మాఱి పోయెనా?"

వారు మేడమీఁదికి వచ్చిరి. పానశాలాధికారి గోడను జేతితోఁదట్టి సద్దుగావించెను. ఒక్కొక్కమెట్టు నెక్కకొలంది లారీహృదయమునందు వేదనాభార మతిశయించుచుండెను. మానటికన్య మన స్సావేదనాపూరిత మయ్యెను. శరీరమునందు స్వేదకణము లంకురించెను. గుండె దడదడ కొట్టుకొన నారంభించెను. అవయవములు కంపించుచుండెను.

డిఫార్జి జేబునుండి తాళముచెవిని బైటికిఁదీసెను.

"మానటి కారాగృహమునం దుండుట కలవాటుపడెను. ఇప్పుడు తలుపు తెఱచియుంచినచో నపాయము తటస్థింప వచ్చును. కావున దలుపులను బంధించియుంచితి"నని యతఁడు

లారీతో నుడివెను.

మానటికన్య ముఖమునందు విషాదమేఘము లావరించెను. ధైర్యకంచుకము సడలి పోయెను. భయవిహ్వాల చిత్తయై వణకిపోవుచుండెను. లారీ యామె ముఖలక్షణములను బరికించెను.

"మానటి! భయపడకుము. ధైర్య మవలబింపుము. నీ వాయన కొనరింపఁగల మేలును శాంతిని సుఖమును గూర్చి యాలోచింపు"మని నుడివెను.

డీఫార్జి తాళముచెవిని దాళమునందుంచి మిగుల సద్దుగావించుచు దానిని దెఱచెను. మెల్లగాఁ దలుపునుదీసి లోనికిఁ బ్రవేశించెను. రండని వారికి జేతితో సంజ్ఞ గావించెను. వారు లోని కరిగిరి. పిమ్మట లోపలవైపునఁ దాను చేయఁగలిగినంత శబ్ద మొనరించుచుఁ దాళమును బిగించెను. గది గుండ నందలి కిటికియొద్ద కరిగెను. అచట నాగి వెనుకకుఁ దిరిగెను.

ఆ గది యొుక చీఁకటికోణము. వంటచెఱకు లుంచుటకు వినియోగింపఁ బడుచుండును. దాని పై భాగమునం దొక చిన్న కిటికిగలదు. దాని కొక గిలక యమర్చఁబడి యుండెను. క్రిందనుండి బరువు వస్తువుల నెత్తుట కది యుపయోగింపఁ బడుచుండును. మామూలు కిటికీలవలె నది రెండుగా విభజింపఁ బడెను. చలిగాలి రాకుండఁ గ్రింది తలుపు మూయఁబడెను. పై రెక్కలు కొంచెము తెఱువఁబడెను. దానినుండి కొలఁదిగా గదిలోనికి వెలుతురు వచ్చుచుండెను. ఆ గదియందుఁ బ్రవేశించు వారికి మొదట నేదియుఁ గాన్పించదు. క్రమక్రమముగా నల

వాటుపడినఁగాని యందలి వస్తువులు గోచరింపవు.

తలుపువైపునకు వీపునుంచి కిటికి వంకకుఁదిరిగి పానశాలాధికారి నిలుచుండెను. వానిముందు క్రింతివాటుగానున్న బల్ల మీఁదఁ గూర్చుండి నరసిన వెండ్రుకలుగల యొక మనుష్యుఁడు తలవంచి చెప్పులు కుట్టుచుండెను.

---

## మూడవ ప్రకరణము

చెప్పులు కుట్టుచున్న యామనుజుని తలవంకనరయుచు "అయ్యా! యభివందనము"లని డిఫార్జి యనెను.

ఆయన యొకక్షణ మూరకుండెను. పిమ్మటఁ దల నెత్తి హీనకంఠస్వరముతో నతని యభివందన మంగీకరించెను.

"ఇంకను శ్రమపడి పనిచేయుచుంటిరా?"

ఆయన యేమియు సమాధానము చెప్పలేదు. చాలసేపూరకుండెను. తరువాతఁ దలయెత్తి "అవును. పనిచేయుచుంటి"నని పృచ్ఛకునివంక నొకసారిచూచి మఱలఁదలవంచెను.

హీనమగు నాయనకంఠస్వరమునందు దైన్యము పొడచూపుచుండెను. వినువారికి భయవిషాదము లొదవించుచుండెను. ఆ దైన్యము దౌర్బల్యమువలనఁ గలిగినదికాదు. చిరకాలము కారాగృహబంధనమువలనఁ గలిగినది. కాని యొంటరితనమును, నిరుపయోగితయును ముఖ్యకారణములు గాక పోలేదు. ఆ స్వరమునందు మానవకంఠస్వరములోని జీవము నశించినది. గంభీరత తొలఁగినది. నైరాశ్యము, నీరసత్వము నెల

కొనినవి. మనోహరమగు వర్ణములతోఁ జిత్రింపఁబడినచిత్రము కాలక్రమమున వెలిసిపోయినట్లు వికాసము మాసియుండెను. భూగర్భమునుండి వెడలినటుల నాతనిమాటలు వినిపించు చుండెను.

కొంచెముసేపాగి "యింకఁ గొంచెము వెలుతురు రానీయనెంచితిని. మీరు సహింపఁగలరా?" యని డిఫార్జి యడిగెను.

ఆయన తన పనిని మానెను. ఆ శబ్ద మెచటనుండి వచ్చినదియు నాయనకు తెలియఁగ రాలేదు. ఒకవైపు భూమివంకఁ జెవియుంచి వినెను. అట్లే రెండవవైపునకుఁ జూచెను. పిమ్మటఁ బైవంక నరసెను.

"ఏమంటిరి?"

"మీ రింకను గొంత వెలుతురు సహింపఁగలరా?"

"రానిచ్చినచో సహింపక తప్పదు."

సగము తెఱచియుంచిన కిటికీ రెక్కల నింకొక కొంచెము తెఱచెను. ఆ కోణములో దానిని బంధించెను. మఱి కొంచెము వెలుతురు గదిలోనికిఁ బ్రవేశించెను. ఆయన తొడ మీద సంపూర్తికాని యొక చెప్పు వారి కగుపడెను. చెప్పులు కుట్టు సాధనములును గొన్ని తోలుముక్కలు వాని పాదముల చెంతను బల్లమీదను బడియుండెను. వానికిఁ దెల్లని గడ్డము కలదు. అది హెచ్చుతగ్గులుగాఁ గత్తిరింపఁబడెను. ముఖము బక్కచిక్కి యుండెను. కన్నులు గుంటలుపడెను. కాని వాని యందలి తైక్ష్ణ్యము తగ్గలేదు. చొక్కా కంఠమునొద్ద తెఱచు కొని యుండెను. అందుండెడి శల్యావశిష్టమైన శరీర మగు

పించుచుండెను. గాలి వెలుతురు తగులకపోవుటచేత దుస్తులన్నియు నాకుపచ్చవన్నెకు మారెను. ఇది లాగు నిది చొక్కాయివి మేజోడులని గుర్తింపరాకుండెను.

వెలుతురు భరింపలేక కన్నులకుఁ జేతినడ్డము జేసికొని యావృద్ధుఁడు చూచుచుండెను. ఆకాంతిపుంజములో నాయన చేతియెముకలు స్ఫుటముగా నగుపించుచుండెను. శూన్యమగు చూపులతో సంకుచితమగు లలాటముతో నట్లేచూచుచుఁ గూర్చుండెను. వానికి శబ్దజ్ఞానము నశించెను. జ్ఞాపకశక్తి విగతమయ్యెను. ఇటు నటు తడుముకొనక ముందున్నవాని మాటలను వినఁజాలకుండెను.

డిఫార్జి లారీకి సంజ్ఞచేసెను. ఆయన ముందున కరుదెంచెను.

"మీరా చెప్పులజతను నేడు పూర్తిచేయుదురా?" యని పానశాలాధికారి యాచెప్పులు కుట్టువాని నడిగెను.

"ఏ మంటివి?"

"మీరా చెప్పులను బూర్తిచేయుదురా?"

"నేను జెప్పలేను. చేయ నెంచితిని. నాకుఁదెలియదు."

ఈ ప్రశ్న యాతఁడొనరించుచున్న పనిని జ్ఞప్తికిఁ దెచ్చెను. మఱలఁదలవంచి చెప్పునుగుట్ట నారంభించెను.

మానటికన్యను ద్వారమునొద్ద విడిచి లారీ మఱింత ముందునకు వచ్చెను. డిఫార్జి సరసన నిలుచుండెను. వృద్ధుఁడు తలయెత్తి పైవైపునకుఁ జూచెను. లారీ నచట నరసి యాశ్చర్యము నొందలేదు. నూతన పురుషసందర్శన మాతని ముఖము నందెట్టి మార్పును గల్పింపలేదు. యథారీతిని దలవంచి తన

పని నొనరించుకొనుచుండెను.

"మిమ్ము దర్శింప నెవరో వచ్చిరి. చూచితిరా?" యని డిఛార్జి ప్రశ్నించెను.

"ఏమంటిరి?"

"మిమ్మెవరో చూడవచ్చిరి".

ఆయన తన చేతులను జెప్పమీదనుండి తీయక తల యెత్తి యెప్పటివలె నీక్షించెను.

"దయచేయుఁడు. ఈ పెద్దమనుష్యునిఁ జూచితిరా? ఏది! మీరు కుట్టుచున్న చెప్పును జూపుఁడు. అయ్యా! మీరు తీసికొను"డని డిఛార్జి లారీతో ననెను. లారీ దానినిఁ జేతఁ గైకొనెను.

"ఇది యేరకముచెప్పు? చేసినవారిపేరును వీరికిఁ జెప్పుడు."

ఆయన యేమియు మాఱాడలేదు. చాలసేపు నిశ్శబ్దముగా నట్లే కూర్చుండెను.

"మీ రడిగినది మఱచితిని. ఏమంటిరి?"

"వీరి కది యే రకము చెప్పో తెలుపుఁడంటిని."

"ఇది స్త్రీలపాదరక్ష. షికారుచెప్పులు. ప్రస్తుతకాలము నందలిరకము. నే నీ రకమును జూడలేదు. ఇటువంటిది నాచేతి యందుఁ గలదు."

ఆయన సగర్వముగా నా పాదరక్షలవంకఁ జూచెను.

"తయారుచేసిన వారిపేరు?" అని డిఛార్జి యడిగెను. ఇప్పు డాతని చేతియం దేమియుఁ బనిలేదు. ఎడమచంకయందుఁ గుడిచేతినిఁ గుడిచంకయందు నెడమచేతి నుంచుకొనెను.

పిమ్మట గడ్డమును సవరించుకొనెను. మరల నట్లే గావించెను. క్షణమైన నూరకుండ లేదు.

"నా పే రడిగితిరా?"

"అవును."

"నూటైదు, ఉత్తర గోపురము."

"అంతేనా ?"

"నూటైదు, ఉత్తర గోపురము"

అతఁ డొక నిశ్వాసమును విడిచెను. మరలఁ దలవంచి చెప్పులను గుట్టుట కారంభించెను. కొంచెము సేపు నిశ్శబ్దముగా నుండెను.

"నీది చెప్పులుకుట్టు వ్యాపారము కాదా?" యని లారీ ప్రశ్నించెను,

చంచలములైన యాయన చూపులను డిఫార్జివంకకు మరలించెను. ఆ ప్రశ్నకు సమాధాన మాతఁ డొసంగవలయు నని యాయనయూహ. కాని యాతఁడేమియు సమాధానము చెప్ప లేదు. ఆయన మరల లారీవంకఁ జూచెను.

"నేను చెప్పులు కుట్టువాఁడనుగాను. ఈపని నేనిచ్చట నేర్చుకొంటిని. నాయంతట నేను నేర్చుకొంటిని. నేర్చుకొనుట కనుజ్ఞ పొందితిని."

ఆయన యొకటి రెండు నిమిషము లాగెను. మరల లారీ వంకఁ జూచి "నాయంతట నేను నేర్చుకొంటిని. చాలకాలము వఱకు వా రనుమతింపలేదు. చివర కంగీకరించిరి. అప్పటి నుండియుఁ జెప్పులు కుట్టుచుంటి" న నెను.

బంధితుఁడు చెప్పులకొఱకుఁ జేతిని జూచెను. లారీ వాని

ముఖమును దేరిచూచుచు నిట్లు ప్రశ్నించెను.

"అయ్యా! మానటి! మీరు నన్నెఱుఁగుదురా?" వృద్ధుఁడా చెప్పులను నేలమీఁద నుంచెను. లారీవంకఁ జూచుచుఁ గూర్చుండెను. మఱల లారీ యాయనను సంబోధించి పానశాలాధికారిని జూపించుచు" అయ్యా! యీయన జ్ఞాపకముండెనా? ఈయన వంకఁ జూడుడు. నన్నుఁ బరికింపుఁడు. పూర్వపు సేవకుఁడుగాని బ్యాంకు నుద్యోగిగాని జ్ఞాపకమునకు రాలేదా? " యని యడిగెను.

మానటి వారివంకఁ దేరిచూచుచు నట్లేకూర్చుండెను. గడ్డమును దలయును దడుముకొనెను. మఱల నాలకించెను. బహుకాలము క్రిందట నశించిన యాప్రజ్ఞాశక్తి కొంచెము తల చూపెను. లలాటమునందు వికాస సందేహానుమానము లంకురించెను. కాని యవి యంతస్ఫుటములు కావు. అంతలో మఱల మేఘావృతములై ప్రజ్ఞాజ్యోతి యదృశ్యమయ్యెను. కాని యా చిహ్నములు దృశ్యాదృశ్యరూపమున నట్లే యుండెను. విగతమైన విజ్ఞానమును స్మృతిపథమునకుఁ గొని వచ్చుటయందుఁ గొంత విజయవంతము కాకపోలేదు.

ఆయన యా యిరువురి ముఖములను బాగుగా బరిశీలించెను. తొల్లింటివలెనే యిటునటు దడుముకొనెను. అతని చిత్తమునందుఁ దుపానులు రేగుచుండెను. అవి తీవ్రమగు కొలందియు వ్యాకుల మతిశయించుచుండెను. ఒక నిట్టూర్పు నిగిడించి తన పనికిఁ బూనుకొనెను.

"అయ్యా! గుర్తించితిరా?" యని డీఫార్జి నెమ్మదిగా నడిగెను.

"ఆ – ఒకక్షణము – మొదట నసాధ్య మనుకొంటిని. నిస్సం దేహము - చూచితిని - ఒకక్షణము. నేను బాగుగా నెఱిగిన ముఖములు. ఆ - పోనిండు ఆ - పోనిండు."

ల్యూసి యింతసేపుఁ గదలక మెదలక నిలుచుండి యంతయు నరయుచుండెను. ఇప్పు డాయన యాసీనుఁడై యున్న బల్లకడకు మెల్లగా నడచివచ్చెను. అచట సద్దుచేయక నిలువఁబడెను. ఆమె గుండె దడదడ కొట్టుకొనుచుండెను. శరీరము కంపించు చుండెను. చెమటబిందువులు ముత్యములవలె వదనమునందు వ్యాపించెను. నిశ్చలదృష్టితో నామె యా ముసలిని విలోకించు చుండెను. ఆయన శిరమునువంచి చెప్పను గుట్టుచుండెను.

చాలసేపు గడచినది. కట్టకడ కాయన చేతియందలి పని ముట్టును క్రిందయుంచి కత్తిని దీసికొనవలసి వచ్చెను. అది యామె నిలుచుండిన వైపునఁగాక రెండవ ప్రక్కనుండెను. దానినిగైకొని మఱల దన కార్యమునకుఁ బూనుకొనుచుండెను. అపు డాయన చూపు ల్యూసి దుస్తులపైఁబడెను. తల నెత్తి యామెవంకఁ జూచెను.

ఆయనదృష్టి ల్యూసీకి భయమును గలిగించెను. అందు మూలమున నామె శరీరము కంపించెను. బంధితుఁ డటు లనేక్షణకాలము పరికించెను. అతని కనులయందు భయవిభ్ర మాశ్చర్యములు ముప్పిరిఁ గొని యుండెను. కొలదిసేపటిలోఁ బెదవులనుండి యస్ఫుటాక్షరములు వెలువడెను. కాని యవి శబ్దమిళితములుకావు. క్రమక్రమముగా నవి యావేగముతో లయించినట్లు వినిపించెను.

"ఇదేమి?"

ఆయన మఱల నాగెను.

"నీవు చెప్పులు కుట్టువాని పుత్రికవు కావా? "

ల్యూసి నిట్టూర్చెను.

"కాదు"

"నీ వెవరవు?"

ఆమె బల్లమీద నాయనప్రక్కనఁ గూర్చుండెను. మానటి ల్యూసీని గాఁగిలించుకొనెను. ల్యూసీ యాయన భుజముపైఁ జేతినుంచెను. పసిడివన్నె వెంట్రుక లుంగరములు తిరిగి యామె మెడపై వ్రేలాడుచుండెను. ఆయన క్రమక్రమముగాఁ జేతినిజాచి యా వెంట్రుకలను బట్టుకొనెను. వానిని బరిశీలించి చూచెను. పిమ్మట దూరముగా జరిగి యొక నిట్టూర్పు విడిచెను. మఱల జెప్పులను గుట్టుటకుఁ బూనుకొనెను.

ఆయన యట్లెంతకాలమో యుండలేదు. ల్యూసి తన చేతుల నాయన భుజములమీద నుంచెను. ఆయన తాను చేయుపని నంతటితో నాపి రెండుమూఁడుసారు లేదో తడుముకొనెను. అది యచటనే యున్నదని నిశ్చయించుకొని చేతులను మెడదాపునకుఁ బోనిచ్చెను. అచటనుండి నల్లదారము చుట్టిన యొక చిన్నగుడ్డముక్కను బైటికిఁదీసెను. దానిని దొడమీద నుంచుకొని జాగ్రత్తగా విప్పెను. అందు రెండుమూఁడు తలవెంట్రుకలు కలవు. అవి పైఁడితీఁగెలవలె మిసిమికాంతులను వెలార్చు చుండెను. ఒకప్పు డా వెంట్రుక లాయన వ్రేలికి జుట్టుకొనియుండెను. ఇప్పుడు వాని నొకగుడ్డపీలిక కొంగునఁ జుట్టి గుప్తముచేసి యుంచెను.

ఆవృద్ధుఁడు ల్యూసి శిరోజములను జేతఁబట్టుకొనెను.

దాచియుంచిన వెండ్రుకలను వానిమీద నుంచెను. రెండిటిని సరిపోల్చి చూచెను. తనలోఁ దానిట్లు వితర్కించుకొనెను.

"అవే. నిశ్చయముగా నవియే. ఎట్లగును ? ఎప్పుడు-ఏలా ?"

ఆమె ముఖమును వెలుతురునకుఁ ద్రిప్పెను. బాగుగాఁ బరిశీలించి చూచెను. ఆయన కేదియో స్ఫురణకు వచ్చినటుల గోచరించెను.

"అవును. ఆమె తన శిరమును నామూపుపై మోపినది. నన్నుఁ బిలిచిన యారాత్రి యామె నేను బయటి కరుగుటకు భయపడినది. బాష్పనిమీలితలోచనములతోఁ బరికంపిత శరీరముతో వలదని ప్రార్థించినది. కాని నాకెట్టి భయము కలుగ లేదు. నేనుత్తరగోపురమునకుఁ గొనిరాఁబడితిని. ఇవి నా భుజములమీద నుండెను. నా కొఱకివి విడిచిపెట్టఁబడెను.

ఆయన పలుసారు లా మాటలను గూడఁబలుకుకొని యొక్కొక్కటిగా నుచ్చరించెను.

"ఇదెట్లు - నీవేనా?"

ఆశ్చర్యచకితములైనచూపు లామెపైఁ బొలయించెను. అవి భయోద్రిక్తములై తోఁచుచుండెను. లారీ డిఫార్జీలు సందేహాందోళితములైన హృదయములతో ముందున కరుదెంచిరి. కాని లూసీ యాయన యొడియందు నిర్భయముగాఁ గూర్చుండెను. ఆమె శోకసాగరమునందుఁ గ్రుంగిపోవుచుండెను. విషాదమేఘావృతమైన ముఖమండలము వికాసరహితమై ముకుళించుకొనెను. రుద్ధకంఠస్వరమున వారితో నిట్లనెను.

"అయ్యా! మిమ్ము వేడుకొందును. మా దాపునకు

రాకుండుఁడు. మాట్లాడకుఁడు. అచటనే యుండుఁడు."

"వినండి. అది యెవరి కంఠస్వరము."

బంధితుఁ డమితావేశము నొందెను. హృదయ మావేగ పూరితమయ్యెను. అతని కరము లామెను విడిచిపెట్టెను. అవి యప్రయత్నముగాఁ దన నరసిన వెండ్రుకలమీఁద కరిగెను. పిచ్చివాఁడై వానిని బీకుకొన నారంభించెను. గడ్డము తడుము కొనెను. రెండుమూఁడు నిమిషములు గడచెను. గుడ్డపీలికను మఱల మడతపెట్టి తనవక్షమున దాచుకొనెను. పిమ్మట నామె వంకఁ గన్నార్పక తీక్ష్ణముగా నవలోకించెను. సవిషాదముగాఁ దల పంకించెను. మఱల నిట్లనెను.

"కాదు. కాదు. కాదు. ముమ్మాటికిని గాదు. నీవు చాల చిన్నదానవు. వికసించుచున్న కుసుమమవు. ఆయావనవికాసము నీయందు లేదు. నీవు కావు. ఈ బంది యెవరో చూడుము. ఇవి యామె చూచిన చేతులు కావు. ఇది యామె యెఱిగిన ముఖము కాదు. ఈ కంఠస్వర మామె విన్నది కాదు. కాదు. కాదు. ఆమెయే! అతఁడే. ఉత్తర గోపురము. చాలకాలముక్రిందట. నీ పేరేమి? దేవకన్యా! నీ పేరేమి?''

ఆయన కంఠస్వరమునందుఁ దొల్లిటి కర్కశత్వము, సత్వము నశించెను. మార్దవము పొడచూపెను. చెక్కులు కోమలములయ్యెను. నయనములు బాష్పాకులితములయ్యెను. లుబ్యాసి మోకరించి యాయన పాదములపైఁ బడెను. ఆమె ప్రార్థనాకరములు వానివక్షమునందుఁ జేరెను.

"అయ్యో! నా పే రింకొకసారి తెలిపెదను. నాజననీ జనకు లెవరో, వారి కష్టజీవిత చరిత్రము నేనేలయెఱుఁగకుంటినో,

నీకు విశదము కాఁగలదు. ఇప్పుడు చెప్పఁజాలను. నే నిప్పుడు చెప్పగలిగిన దొకటియే. నన్ను స్పృశింపుము; ఆశీర్వదింపుము ముద్దుపెట్టుకొనుము.”

ల్యూసీ యాయనను శిశువువలెఁ దన యొడియం దఢముగా నుంచుకొనెను. ఆమె శిరోజము లాయనముఖము నందును గడ్డముమీదను వ్రేలాడుచుండెను.

“నా కంఠస్వరము నందు నొకప్పుడు నీ చెవులకు మధుర వీణాగానమైన నీ భార్య కంఠస్వరము వినిపించు నేని దానికై విలపింపుము. యౌవనమునందుఁ బ్రణయ తరంగితమైన నీ వక్షమునందాల్చిన యాశిరము నా శిరోజములందు స్ఫురించి నచో దానికై విలపింపుము. తనయానురాగముతోడను బూర్ణ విశ్వాసముతోడను నిన్ను సేవింప వచ్చిన గృహమును గూర్చి ప్రసంగింతునేని సర్వశూన్యమగు నొక యింటిని నీకు జ్ఞప్తికిఁ దెచ్చిన దాననగుదును. దానికై విలపింపుము.”

వారి కన్ను లశ్రుధారాపూరితము లయ్యెను. అవి ప్రవాహములై జాలువారెను. ఆయన ల్యూసీకరములందుఁ గూలెను. ముఖము వక్షముమీదకు జారెను. ఆ దృశ్యము హృదయవిదారకమై భయశోకము లొదవించెను. వారి హృదయములు శోకాగ్నిసంతప్తము లగుచుండెను. గతానుభవములు తీవ్ర ఝంఝామారుతములై వీచుచుండెను. అవి యుడుకెత్తి యుష్ణ నిశ్వాసములై నిర్గమించుచుండెను. ప్రేక్షకు లిరువురు దుఃఖావేశమునఁ దమ ముఖములను జేతుల నిడుకొనిరి.

గదియంతయుఁ బ్రశాంతముగా నుండెను. భయంకర మగు తుపాను వీగిన యనంతరము ప్రసన్నభావమువలె వారి

చిత్తములు శాంతినొందెను. ఆ వృద్ధుఁడు కంపితశరీరముతో సంచలితమానసముతో నట్లే పడియుండెను. లారీ డిఫార్జీలు వారిని లేవనెత్తుటకు ముందున కరుదెంచిరి. కాని ల్యూసీ వారిని వారించెను. ఆ వృద్ధుని శరీర మశక్తతచే క్రిందికొరిగెను. ఆయనతలను దన కరములం దిడుకొని ల్యూసి ప్రక్క కొదిగెను. ఆమె శిరోజములు జీరాడుచు నాయన ముఖమునకుఁ దెరవలె నడ్డముగా నుండెను.

వెంటనే యాయనను పారిసునగరమునుండి కొనిపోవుటకు నిశ్చయింపఁబడెను. అనుమతిపత్రములు, బండి, గుఱ్ఱములు గొనిరాఁబడెను. బలవంతముమీఁద వారొసంగిన యన్నపానీయములను మానటి గైకొనెను. వారందఱు ప్రయాణమునకు సంసిద్ధులైరి. మానటి బండి నధిరోహించుచు విషాదపూరిత నయనములతోఁ దన చెప్పులుకుట్టు పరికరములకై యడిగెను. అవి కొనిరాఁబడెను. వారాయన నింగ్లాండునందలి నూతన గృహమునకుఁ గొనిపోయిరి. ప్రయాణసమయమునం దాయన కెట్టి యాపద సంఘటించునో యని లారీ ల్యూసీలు మిగుల నాందోళనము నొందిరి.



# ఉత్తరగోపురము

## రెండవ భాగము

### మొదటి ప్రకరణము

పారిసునగరమునుండి మానటి లండనున కరుదెంచి యెదు సంవత్సరములైనది. చార్లెసు డార్నేమీద రాజద్రోహ మారోపింపఁబడి లండనునందు విచారింపఁబడు చుండెను. ఆరోజులందు రాజద్రోహమునకు మరణశిక్షయే దండనము. అభి యోగము విచిత్రముగా నుండుటచే న్యాయసభాభవన మంతయుఁ బ్రేక్షకులతో నిండియుండెను.

సభామధ్యమందు బల్లచుట్టు న్యాయవాదులు టోపా లతో నాసీనులైయుండిరి. రక్షకభటశాఖాధికారియుఁ బ్రభుత్వ న్యాయవాదియు నభియోగమును బ్రతిపాదించుచుండిరి. స్ట్రైవరు, సలహాసంఘము, నింకొక న్యాయవాదియు నేరస్థుని తరఫున వాదించుచుండిరి. ఆన్యాయవాది తలమీద టోపా కలదు. జేబులం దిరుచేతుల నిడుకొని వాదప్రతివాదములందు జోక్యములేని వానివలె నిరంతరముఁ గప్పువంక నరయు చుండెను.

నేరస్థుఁడు బోనులోనికిఁ దీసికొని రాఁబడెను. పైవంక నరయుచున్న న్యాయవాదితప్ప ప్రేక్షకులంద ఱాతనివంక నాదరవిషాదములతోఁ దేరి చూచుచుండిరి. చార్లెసుడార్నే యిరువదియైదేండ్ల యువకుఁడు. దృఢమగు శరీరముకలవాఁడు. సుందరాకారుఁడు. నల్లని కనీనికలు. గుండ్రనిముఖము. ఉన్నత మగు వక్షము. తుమ్మెదరెక్కలవంటి నడుపగు శిరోజము

లాతని యందమున కొక వింత సొబగు నాపాదించుచుండెను. ముఖలక్షణము లతఁ డొక మర్యాదగల గొప్పకుటుంబమునకుఁ జెందినవాఁడని చెప్పకయే చెప్పుచుండెను. అతఁడు నల్లని యుడుపులను ధరించెను. శిరోజములు వెనుకవైపున గుడ్డపీలికతోఁ గట్టఁబడియుండెను. అది యందమునకుఁగాక ముఖముపైఁ బడకుండుట కొఱకని తోచును. ఆతఁ డాత్మగౌరవము కలవాఁడు. న్యాయాధిపతికి నమస్కరించి నిశ్శబ్దముగా నిలబడెను.

నేరస్థుఁడు సభికులవంక నొకసారి పరికించెను. అతని చూపు లిరువురు వ్యక్తులపైఁ బ్రసరించెను. వారీ విచారణయందు సాక్షులు. అందొకవ్యక్తి యిరువదియేండ్లకుఁ బైఁబడిన యౌవనవతి. రెండవవాఁ డొక వయస్సుముదిరిన పెద్దమనుష్యుఁడు, ఆ యువతికి జనకుఁడు. నరసిన తలవెండ్రుకలు, నాలోచనానిమగ్నములైన చూపులతోఁ డిముఖము నతనిరూపము నందొక ప్రత్యేకతను గల్పించుచుండెను. ఇప్పు డాయన వయోవృద్ధునివలె నగుపించుచుండినను మధ్యమధ్య కుమార్తెతో సంభాషించునపుడు యౌవనప్రాదుర్భావము జారని సుందరాకృతిగా గోచరించుచుండెను.

ఆబాలిక కుడిచేతిని దండ్రియెడమ సందిటఁ జొనిపించి యెడమ చేతిని జేతుల మీఁదనుంచి భయావేగములతో నాతని నొత్తుకొని కూర్చుండెను. ఆమెచూపులు నేరస్థునిపైఁ గేంద్రీకరింపఁబడెను. ఆమె హృదయము విషాదపూరితము. చూపులు దయాంతరళితములు. చేష్టలు వేదనావహములు.

చార్లెసుడార్నేపై నన్యాయముగా రాజద్రోహ మారోపింపఁబడెను. ఇంగ్లాండునకు వ్యతిరేకముగా నొనరించు

యుద్ధములందు ఫ్రాన్సురాజగు లూయీకిఁ బలువిధముల సాయ మొనరించుచుండె ననియు నాకారణమున రెండు రాజ్యముల మధ్య నతఁడు పలుసారులు వచ్చుచుఁ బోవుచుండెననియు, నేయే పటాలము లేయే ప్రయత్నములకై గసడాకుఁ బంపఁ బడుచుండినదియు రహస్యముగా భోగట్టాచేసి ఫ్రెంచిరాజునకుఁ దెల్పుచుండెననియుఁ బ్రభుత్వవాదుల ప్రతిపాదన.

ప్రభుత్వ పక్షమున న్యాయవాది యిట్లుచెప్పెను. "నేర స్థుఁడు బహుసంవత్సరముల నుండియు ఫ్రాన్సు ఇంగ్లాండు దేశ ములమధ్య వచ్చుచుఁ బోవుచుండెను. ఇది రహస్య వ్యాపా రము. దానినిగూర్చిసరియగు సమాధాన మీయఁ జాలకుండెను. నేరస్తునిమిత్రు డొక రహస్యకార్యమును గనిపెట్టెను. దేశ భక్తిపరాయణుఁడగు నతఁడు ప్రభుత్వమున కది వెల్లడింపఁ గృతనిశ్చయుఁడయ్యెను. అతని నామము బార్సాడ్. సాక్ష్యము నకుఁ గొనిరాఁబడెను. ఈ రహస్య వ్యాపారమునుగూర్చి యాచూకి నేరస్తుని సేవకుఁడగు రోజర్ క్లై వలనఁ దెలిసినది. అతఁడు నేరస్తుని జేబులను సొరుగులను బరిశీలింపఁగా నీ కాగి తములు లభించినవి. వారిరువు రొసగిన సాక్ష్యములనుబట్టియు నీ కాగితములనుబట్టియు నేరస్తుఁడు ప్రభుత్వసేనల జాబితా యును, వారి సముద్రమార్గమునను భూమార్గమునను నొనరించు యత్నములును రహస్యముగా గ్రహించి విరోధిరాజ్యముల కెఱిఁగించుచుండె ననుట స్పష్టము. ఈ కాగితములు నేరస్తుని స్వంతదస్తూరియందు లేవనుట సత్యము. అట్లుండిన, నుండకపోయిన నొకటే. నేరస్థుఁ డతని కార్యమునం దెంత జాగ్రత్తగా వర్తించుచుండెనో యిందుమూలమున న్యాయ

సభవారికి విశదముకాగలఁదు. ఐదేండ్లకుఁ బూర్వము బ్రిటిషు ప్రభుత్వపుసేన లమెరికాతోడి యుద్ధ ప్రారంభమునకుఁ గొలది వారములకుఁ బూర్వమునుండియు నేరస్థుడీ రాకపోకలను జరుపుచుండెను. ఈ హేతువులచే నేరస్థుఁడు దోషియని న్యాయ సభకు విశదమైనది. కావున దండనార్హుఁడు."

జాన్ బార్నాడ్ సాక్ష్యము తీసికొనఁబడెను. అనుకొని నటులనే యాతఁడు చెప్పిన కథ దోషారోపణసంఘము ప్రతిపా దించిన విషయముల ననుసరించియుండెను. పిమ్మట స్ట్రైయివరు ప్రతివాది సలహాసంఘము బార్నాడును పునఃపరీక్ష గావించిరి. బార్నాడ్ గుణములుగాని ప్రవర్తనముగాని యభిప్రాయములు గాని పేర్కొనఁబడినంతయు యథార్థములుగావు. సత్యమున కాతఁడు నమ్మఁదగినవాఁడుకాఁడు. అతఁడు వేగరియనియు దొంగసాక్ష్యముల కలవాటుపడినవాడనియు గట్టి సందేహము కలిగినది.

నీవెప్పుడైనను వేగరిగాఁ బనిచేసితివా యని ప్రశ్నింప నతఁడు లేదని తిరస్కరించెను. స్ట్రైవయి రాతనిపైఁ బ్రశ్నపరం పరను శరధారలుగా వర్షించెను.

బార్నాఁడెట్లు జీవించుచుండెను? ఆతనియాస్తిమీఁద. ఆ స్తి యెచటనున్నది? సరిగా గుర్తు లేదు. సంక్రమించిన యాస్తియా? అవును. ఎవరినుండి? దూరబంధువులనుండి. చాలదూర బంధువా? కొంచెము. అతఁ డెప్పుడైనను ఖైదునం దుండెనా? లేదు. ఎప్పుడులేదు. ఎప్పుడు బాకీదారుని ఖైదునందులేడా? ఈ నేరముతో నావిషయమున కెట్టి సంబంధము కలదో యతనికిఁ దెలియకున్నది. స్ట్రైయివరు మరలఁ బ్రశ్నించెను. అతఁడెప్పుడు

బాకీదారుని ఖైదునందు లేఁడా? ఉండెను. ఎన్నిసారులు? రెండు మూఁడుసారులు. ఐదారుసారులు కాదా? కావచ్చును. అతని యుద్యోగమేమి? పెద్దమనుష్యుఁడు. అతఁడెప్పుడైనను దన్నులను దినెనా? తినియుండవచ్చు. మేడమీఁదనుండి క్రిందికిఁ దన్న బడెనా? లేదు. మేడపై మెట్టుమీఁదఁ దన్నఁబడెను. తనంతటఁ దానే క్రింది యంతస్తునకు దొరులుచుఁ బడెను. జూదమునందు మోసముచేయుట వలనఁగదా తన్నులను దినినది? ఆ తన్నిన వాఁడట్లు చెప్పెను. అది సత్యముకాదు. మాయజూదము లాడుట చేత నతఁడెప్పుడు జీవింపలేదా? ఎప్పుడులేదు. జూదములమీఁద నతఁడెన్నఁడు జీవింపలేదా? లోకములోని పెద్దమనుష్యుల కంటె నధికముగా నెన్నడును లేదు. నేరస్తుని యొద్దనుండి యతఁడెన్నడు పైకము నప్పుగాఁ దీసికొనలేదా? తీసికొనెను. ఆయప్పు దీర్చెనా? లేదు. నేరస్తునితో నాతని పరిచయము కొలదికాదా? బండ్లలోను బూటకూటి యిండ్లయందు నేరస్తునికి నొత్తిడి కలిగించలేదా? ఈ కాగితములు తనంతటఁదాను సంపాదించినవి కావా? కావు. ఈ సాక్ష్యమిచ్చినందులకుఁ దనకు ధనమొసంగఁ బడునని యాశించుటలేదా? లేదు. ఇట్టి పన్నాగము లొనరించుటకుఁ బ్రభుత్వము జీతమిచ్చుచుండుటలేదా? లేదు. దేశభక్తితప్ప యితరాశయము లాతని కేమియు లేవా? ఏమియు లేవు.

రోజరుక్లై నేరస్తునిక్రింద సేవకునిగా నాలుగేండ్లకుఁ బూర్వము వినయవిశ్వాసములతోఁ బనిచేసితినని నుడివెను. అతఁడు కెలేకుఁబోవు పయనపుటోడలో నేరస్తుని గలిసికొని సేవకుఁడెవడైనను గావలయునా యని ప్రశ్నించెను. నాటినుండి

యు వానిని నియమించుకొనెను. అతఁడు నేరస్థునిమీద సందేహము కలిగి జాగ్రత్తగాఁ గన్ను వేసి కనిపెట్టుచుండెను. ప్రయాణ సమయములందు బట్టలను సర్దునపుడు నేరస్థుని జేబులందిటువంటి కాగితములను బలుమాఱు చూచుచువచ్చెను. బందీ సొరుగుల నుండి యీకాగితములను దీసికొనెను. ప్రైయివరు వానిని ప్రశ్నింపఁగా మొదట నాపత్రము లచటఁబెట్టలేదని సమాధానము చెప్పెను. ఆ పత్రములను నేరస్థుఁడు కెలెలోని యొక ఫ్రాన్సుదేశీయుఁడగు పెద్దమనుష్యునకుఁ జూపుచుండగాఁ జూచితి ననియు, బోలొనునొద్దకూడ నిట్టిపత్రముల నొక పరాసు దేశీయునకుఁ జూపించెననియు వచించెను. అతఁడు వెనుకటి సాక్షిని నేడెనిమిదేండ్లనుండియు నెఱుగును.

మానటి కన్యను సాక్ష్యమునకుఁ బిలిచిరి. రక్షకభటాధికారి యామె నిట్లు ప్రశ్నించెను.

"మానటీ! నీ వీ ఖైదీని పూర్వము చూచితివా?"

"చూచితిని."

"ఎచట?"

"ఐదేండ్ల క్రిందట ప్రయాణపుటోడయందు నాంగ్లేయ సముద్రముపైఁ బయనించుచు."

"మానటి! ఆ ప్రయాణసమయమునందు ఖైదీతో నీ వేమైనను సంభాషించితివా?"

"ఆఁ సంభాషించితిని."

"జ్ఞాపకము చేసికొనుము."

ప్రశాంతమగు సభామధ్యమునందుండి యామె యీ రెలుంగుతో నిట్లు చెప్ప నారంభించెను.

"నేరస్థుఁ డోడలోని కరుడెంచునప్పటికి నా తండ్రి యస్వస్థతగా నుండెను. దుర్బలుఁడై మిగుల నాయాస పడుచుండెను. చలిగాలి తీవ్రముగా వీచుచుండెను. గాలిలోఁ బ్రయాణ మొనరించుటకు భయపడితిని. ఆ రేయి మెట్లప్రక్కన నున్న గదియం దాయనకు శయ్య నమర్చితిని. గాలినుండి సంరక్షించు నుపాయము నాకుఁ దోచలేదు. నా జనకుని దుఃస్థితిని గమనించి దయామతియై నాకు సదుపాయము నెఱిగించెను. ఓడ రేవునుండి బయలుదేరునప్పటి గాలివాలు నెఱుంగకపోవుటచే నా కాయన బోధించినది యర్థముకాలేదు. నా కొఱ కాయన శ్రమతీసికొని నా తండ్రికి గాలిచాటునఁ బక్క నమర్చెను. నా జనకుని యనారోగ్యమునకు హృదయమున మిగుల జాలిగొనెను. తన విషాదమును వెల్లడించెను. అది యాయన వేదనాపూరితమగు నంతరంగము నుండి యవ్యాజముగా నిర్గమించెననుట నిశ్చయము. ఈ యపూర్వసంఘటనము మా సంభాషణకుఁ గారణభూతమయ్యెను."

"ఒకక్షణము మధ్య జోక్యము కలిగించుకొనుచుంటిని. అతఁడొక్కడే యోడలోనికి వచ్చెనా?"

"లేదు."

"వానితో నెందరుండిరి?"

"ఇరువురు పరాసు దేశీయులు. పెద్దమనుష్యులు."

"వారు కలిసి సంభాషించుకొనిరా?"

ఓడ బయలుదేరునంతటివఱకు మాట్లాడుకొనుచునే యుండిరి. చివరకుఁ బరాసు దేశీయులు దిగిపోయిరి.

"ఇటువంటి కాగితములేవైన వారికొసఁగబడెనా?"

"కొన్ని కాగితము లీయఁబడినవి. అవి యే కాగితములో నాకుఁ దెలియవు."

"పొడుగు వెడల్పులయందు పీనిని బోలియుండెనా?"

"ఉండవచ్చును. కాని దృఢముగాఁ జెప్పఁజాలను. వారు రహస్యముగా నేదో మాట్లాడుకొనుచు నా సమీపమున గది మెట్ల చివర నిలుచుండిరి. అచట దీప మొకటి వ్రేలాడు చుండెను. అది కళావిహీనమై మకమక లాడుచుండెను. వారు నెమ్మదిగా మాట్లాడుకొనుచుండుటచే వారి మాటలు వినఁ బడలేదు. కొన్ని కాగితములుమాత్రము వారి చేతియందుఁ జూచితిని.

"నేరస్తుఁడు దేనినిగూర్చి సంభాషించుచుండెను?"

"నా నిస్సహాయత నాయన పరికించెను. నా తండ్రియెడఁ గరుణాళుఁడై నాకు సహాయ మొనరించుచు వచ్చెను. నా యందు నమ్మకముతో మనసువిచ్చి సంభాషించెను. నయనము లందుఁ గన్నీరు వెడలించెను. ఆయన యుపకారమునకు నేడు నే నీ యుపకార మొనరించుచుంటిని."

మానటి కన్నుల నీరు సుడులు తిరిగెను. స్వరము కంపించెను. ధైర్యము చలించెను.

"మానటి! నీవు సాక్ష్య మొసంగుదు వని నేరస్తునకు బాగుగాఁ దెలియును. ఇది నీ ధర్మము. తరువాత?"

"అపాయకరమగు నొక రహస్యకార్యమును బురస్క రించుకొని ప్రయాణ మొనరించుచుంటిని. అది వెల్లడియగునేని జనులకుఁ బ్రమాదము వాటిల్లును. కావున నేను మాఱుపేరుతోఁ బ్రయాణ మొనరించుచుంటిని. కార్యావసరముండి కొలది దిన

ములకుఁ బూర్వమే ప్రాన్సున కేగితిని. ఇంకను గొంతకాల మిట్లు రాకపోకలు సాగింపవలసియుండు"నని యాయన నాతో నుడివెను."

మానటిని బరీక్షించిరి. కాని యాయన నేరస్తుని గుర్తింపలేక పోయెను.

"నీవు గుర్తింప లేకపోవుటకుఁ బ్రబలకారణము కలదా?" యని రక్షణశాఖాధికారి ప్రశ్నించెను.

"ఉన్నది" యని హీనస్వరముతో మానటి సమాధానము చెప్పెను.

"మానటి! నీ స్వదేశమున నిన్ను విచారణగాని, దోషారోపణగాని లేకుండఁ గారాగృహమునందు దీర్ఘకాల ముంచుట చేతనా?"

ఆయన సన్నని దీనమగు కంఠస్వరముతో సమాధానము చెప్పెను. అది యచటి జనములకు హృదయవిదారకమయ్యెను.

"దీర్ఘమగు కారాగృహవాసము."

"ఈ సందర్భమునందు మీరు నూతనముగా విముదల చేయఁబడితిరా?"

"అట్లే యందురు."

"ఈ సందర్భమునుగూర్చి మీ కేమైనను జ్ఞాపకమున్నదా?"

"లేదు. హృదయము కొంతకాలమునుండి శూన్యముగా నున్నది. ఎంతకాలమునుండియో నేను జెప్పఁజాలను. ఎప్పుడును నన్ను ఖైదునందుంచిరో, యెప్పుడు చెప్పులు కుట్టితినో యెప్పుడు లండనునకు వచ్చి నా కుమార్తెతో నివసించితినో

నే నేమియుఁ జెప్పఁజాలను. నేను దైవానుగ్రహమునఁ గొంత శక్తిని పుంజుకొనునప్పటికి నా తనయతో నాకుఁ బరిచయము కలిగినది. ఆమె నా కెట్లు పరిచయమైనదికూడ నాకుఁ దెలియదు. ఆ విధానము నాకు జ్ఞప్తియందు లేదు."

రక్షణశాఖాధికారి యాసీనుఁడయ్యెను. నూనటి ల్యూసీలు సహిత మాసీనులైరి.

నేరస్థునిపైఁ గొనిరాఁబడిన యభియోగ మిది.

ఐదు సంవత్సరముల క్రిందట నవంబరు మాసమునం దొక శుక్రవారమునాఁడు నేరస్థుఁడు కొందరు రాజద్రోహులతోఁ గలిసి డోవరు రహదారి శకటమునందుఁ బ్రయాణ మొనరించెను. రాత్రి రహస్యముగా నొక చోటఁ దిగి యచట నిలువక పండ్రెండుమైళ్ళు వెనుకకు మఱలివచ్చి యచట స్కంధావారమున కేగెను. అచటసైన్యముల యాచూకి తీసికొని దాపునఁ గల నగరమున కరిగెను. అందొక పూటకూటియింట నొక గదియందు మరికొందఱ కొఱ కెదురుచూచు చుండెనని దోషారోపణ గావింపఁబడెను. ఈ యభియోగమును నిరూపించుటకై సాక్షులు నేరస్థుని గుర్తింపవలయును. అందులకై సాక్షులు రావింపఁబడిరి. నేరస్థుని పక్షమునందున్న న్యాయవాదియు సలహాసంఘమును వారిని బరీక్షించుచుండిరి. కాని ప్రయోజనము లేకపోవుచుండెను.

ఇంతకాలము కచేరి పై కప్పు నరయుచున్న న్యాయవాది యదను నెఱిగి యొక చిన్న కాగితముమీద నొకటి రెండు మాటలు వ్రాసి దానిని మడచి స్ట్రైయివరు వైపునకు విసరెను. అతఁ డా కాగితమును విప్పి చదువుకొనెను. మఱుక్షణము

మిగుల జాగ్రత్తతో నేరస్తుని బరిశీలించెను. తరువాత నా సాక్షి నిట్లు ప్రశ్నించెను.

"ఇతఁడు నేరస్తుఁడే యని నీవు నిర్ధారణగా చెప్పుచుంటివి."

"నిస్సందేహముగా."

"ఈ నేరస్తునిఁ బోలిన వాని నింకొకనిని నీ వెప్పుడైనఁ జూచితివా?"

"నేను బొరపడునంత పోలికకలవానిని జూచియుండలేదు"

కాగితము విసిరివేసిన న్యాయవాదివంకఁ జూపుచు "ఆ పెద్దమనుష్యునివంకఁ జూడుము. నేరస్తుని బాగుగా నరయుము. వీ రొకరి నొకరు పోలియుండలేదా?"

వారు సర్వవిధముల నొండొరులను బోలియుండిరి. అచట నున్న వారందఱు వారినిగాంచి యాశ్చర్యపడిరి. సాక్షియు విభ్రాంతినొందెను. ఆ న్యాయవాదిపేరు కార్టను. అతఁ డతని తలమీఁదనున్న టోపాను దొలగించెను. వారిపోలిక యందరకు మఱింత రిచ్చపాటును గలిగించెను. కావున నా సాక్షి సాక్ష్యము నిరుపయోగ మయ్యెను.

స్ట్రియువరు నేరస్తునిపక్షమున నిట్లు వాదించెను. "బార్సాడు లంచగొండి. వేగులవాఁడు. దుర్మార్గుడు. సేవకుఁడు క్లై బార్సాడుతో భాగస్వామి. ఈ సాక్షు లిరువురుఁగలిసి పత్రములను సృష్టించి యబద్ధప్రమాణము లొనరించిరి. వారికిని నేరస్తునకు విరోధము కలదు. నేరస్తుఁడు ఫ్రాన్సుదేశీయుఁడు. కొన్ని సాంసారికపరిస్థితులమూలమున ఫ్రాన్సు ఇంగ్లాండుల మధ్య తఱచుగా వచ్చుచుఁ బోవుచుండెను. ఆవిషయములు వెల్లడింపఁ దగినవికావు."

న్యాయాధిపతి సాక్షుల వాఙ్మూలములను సింహావలోకన మొనరించుచుండెను. న్యాయసంఘ మొండొరులతో నాలోచించుకొనుచు న్యాయమును గూడబలుకుకొనుచుండెను. కార్టను బైవంక నరయుచు నట్లే కూర్చుండెను. ఉద్రేక కారణము లయిన పరిస్థితులందు సహిత మతఁడు తనచోటునుగాని ప్రవృత్తినిగాని మార్చుకొనలేదు. స్ట్రైయివరు కాగితములను సవరించు కొనుచుండెను. తన సమీపమునఁ గూర్చున్న వారితో మెల్లగా మాట్లాడుచు న్యాయసంఘమువంక నాతురతతో నరయుచుండెను. ప్రేక్షకులందఱు తమ యాసనములనుండి లేచిరి. న్యాయపతియుఁ దన పీఠమునుండి లేచి వేదికమీఁద నటునిటుఁ దిరుగుచుండెను. కార్టను కూర్చుండిన ప్రదేశమునుండి కదలక మెదలక వెనుకకుఁ జాగిలఁబడి యట్లే మింటివంక నరయుచుఁ గూర్చుండెను. అతని చూపులందు నిర్లక్ష్యభావము గోచరించుచుండెను. అట్లుండియు నచట జరుగుచున్న సర్వవిషయములను జాగ్రత్తతోఁ బరిశీలించుచుండెను.

ల్యూసి నేరస్థుని భావిఫలాఫలములను దలంచినపుడు హృదయము భయకంపిత మయ్యెను. విషాదమేఘములు ముఖమండలమునం దావరించి వికాసరహితము గావించెను. తీవ్రమగు వేదనావశమువ జనకుని యురముపై శిరమును వాల్చి మూర్ఛయందు మునిగెను. ఆమె దుఃఖస్థితిని మొదట కార్టను గమనించి సేవకుని బిలిచెను. "ఆ యువతిని జాగ్రత్తగాఁ జూడుము. బైటకుఁ గొనిపోవుటకుఁ దండ్రికి సాయ మొనరింపుము. ఆమె క్రిందఁ బడిపోవుచున్నది. చూచుటలేదా" యని యాదేశించెను.

ల్యూసి బైటికిఁ దీసికొనిపోఁబడెను. ఆమె దీనస్థితి కందఱు జాలిపడఁ జొచ్చిరి. కారాగృహావాసమునుగూర్చి జ్ఞప్తికిఁ దెచ్చుటచే మానటి వికలహృదయుఁడయ్యెను. అతని జూపు లందు విచారమేఘములు భరమై యావరించెను. అప్పు డాతఁ డొక వృద్ధునివలె నందరకు గోచరించెను.

కార్టను ల్యూసి పరిస్థితిని విచారించి యా వృత్తాంత మును డార్నే కుఁ దెలిపెను.

"నీవు మానటికన్య శరీరస్థితినిగూర్చి యెఱుఁగుటకు వేగిరపడుచుంటి వని తలంతును. ఆమె మూర్ఛనుండి కొంచెము తేరుకొనినది."

"ఆమె యా వేదనకు నేను గారణమైతినని విచారపడు చుంటిని. ఆమెకు నా కృతజ్ఞత లని తెలుప వేడుకొందును"

"అట్లే యెఱిగింతును; మీరు కోరినచో."

కార్టను నిస్సందేహాంతరంగముతో నేరస్తుని వైపునకు సగము తిరిగి నిలుచుండెను.

"కోరుచుంటిని. నా కృతజ్ఞత నంగీకరింపుడు."

"మీ రేమని యూహించుచుంటిరి?"

"అధమము."

"అట్లూహించుట మంచిదే. కాని న్యాయసంఘము నీ పక్షమునందున్నది.

చాలసేపు గడచెను. న్యాయసంఘ మొక నిశ్చయము నకు వచ్చెను. చార్లెసుడార్నే విడుదల చేయఁబడెను.

---

## రెండవ ప్రకరణము

విచారణానంతరము మానటి, ల్యూసి, లారీ, స్ట్రైయివరు ప్రతివాది సలహాసంఘము చార్లెసుడార్నే చుట్టు మూగి యభినందనముల నర్పించుచుండిరి.

మానటి పూర్వపరిస్థితినుండి సంపూర్ణముగాఁ దేరుకొనెను. అతని ముఖమునందు బ్రజ్ఞాజ్యోతి వెలుగొందుచుండెను. ఆకృతి బలిష్ఠమై యౌవనప్రాదుర్భావమును బొందెను. అతనియందుఁ బారిసునగరమునందుఁ జీకటికొట్టమునఁ జెప్పులు కుట్టినవాని కవళికలు నిండు వెలుతురులోఁ బరికించినను నిపుడు గోచరించుచుండుటలేదు. కాని పూర్వగాథలు త్రవ్వినపుడెల్ల నాతని యంతరంగము విషాదమేఘావృతమై చైతన్యము నశించి క్రుంగిపోవుచుండును. ఆ యంధకారమును మఱలించుట కాతని కుమార్తె యొక్క తెయే సమర్థురాలు.

డార్నే ల్యూసికరమును గృతజ్ఞతాపూర్వకముగా ముద్దుపెట్టుకొనెను. స్ట్రైయివరు నభినందించుట కాతనివంకకుఁ దిరిగెను. అంతలో మానటి డార్నేవంక వింతగా నరయుచుండెను. అతని ముఖము మంచువలెఁ బాలిపోయినట్లయ్యెను. చూపులందు ననిష్టతయు సంశయము వృద్ధియగుచుండెను. ఈ విచిత్రప్రవృత్తియం దాతని తలంపులు చలించుచుండెను. ల్యూసి యది గ్రహించి రెండుమూడు మాటలతో మన మింటికిఁ బోవలయునని నుడివెను. అంతలో నతఁడు మఱల యథాస్థితికి వచ్చెను.

ఎవరిదారిని వారరుగుచుండిరి. కార్టను డార్నేను మెల్లగా సమీపించెను. అతనితో నిట్లు సంభాషించెను.

"మన పరిచయమున కిది యపూర్వసంఘటనము. ఈ వీధిరాళ్ళపై నొంటరిగా నిలుచుండుటచేత నీ రాత్రి మీకు విచిత్రముగాఁ దోఁచుచుండవచ్చును.

"నే నీ ప్రపంచములోనివాఁడ నని నా కింకను నమ్మకము కలుగుట లేదు"

"ఆ విషయమై నేను వింతపడను. మఱొక ప్రపంచమునకు మీరు చాలదూరము ప్రయాణ మొనరించి యెంతో సేపు కాలేదు. నిస్త్రాణగా మాట్లాడుచుంటి రేల?"

"నిస్త్రాణగా నున్నదని తలంచుచుంటిని."

"అట్లయిన నేల భోజనముచేయరు? మీ యదృష్టమును గూర్చి న్యాయసంఘ మాలోచించుచుండగా నేను భుజించితిని. ఈ దాపుననే యొక పానశాలను జూపెదను. తృప్తిగాఁ గడుపు నింపుకొనవచ్చును. రమ్ము."

డార్నే చేతిని కార్టను చంకయం దిరికించుకొని లడ్గేటు గుండ ఫ్లీటువీధికిఁ దీసికొనిపోయెను. అచట నొక పానశాలయందు వారు ప్రవేశించిరి. వారి కొక చిన్న గది చూపింపఁబడెను. డార్నే సుష్ఠుగు భోజనముతోడను ద్రాక్షా రసముతోడను బలమునఁ దేరుకొనుచుండెను. కార్టను వాని కెదురుగాఁ గూర్చుండెను. వానిముందుఁ బ్రత్యేకముగా ద్రాక్షారసముతో నింపఁబడిన బుడ్డిగలదు.

"డార్నే! నీ వీ ప్రపంచమునం దున్నావని యిప్పుడైనను దలంచుచుంటివా?"

"భయమువలనఁ గాలము ప్రదేశములనుగూర్చి దడ బాటు పడుచుంటిని. కాని నే నీ ప్రపంచమునం దుంటినని

తలంపఁ గలుగుచుంటిని.''

"అదే చాల సంతోషము.''

ఆతఁ డీమాటను వెగటుగాఁ బలికెను. మఱలఁ బాన పాత్రను ద్రాక్షారసముతో నింపెను.

"నాకు మాత్రము నే నీ ప్రపంచమునం దుంటినను తలంపు మఱచిపోవలయునని కోరుచుందును. ఈ ద్రాక్షారసముతప్ప లోకమువలన నా కే ప్రయోజనములేదు. నా వలన లోకము నకుఁ బ్రయోజనములే''దని కార్టను నుడివెను.

దోషవిచారణసమయమునందుఁ గార్టను డార్నేకు సకాలమునం దొనరించిన యుపకారము జ్ఞప్తియందుండెను. అది జరుగకున్నచో నత డీ పాటికి మృత్యుదేవత కరాళ దంష్ట్రాంకురములందుఁ జిక్కుకొని హృదయవేదన ననుభవించు చుండెడివాఁడు. కావున డార్నే ప్రాణదాన మొనరించిన కార్టనునకుఁ దన కృతజ్ఞలను వెలిబుచ్చెను.

"మీ కృతజ్ఞలుగాని పొగడ్తలుగాని నా కేమియు నక్కర లేదు. నేను జేసిన యుపకారము చాలకొలదిపాటిది. అది నే నెందుకుఁ జేసితినో నాకుఁదెలియదు. కాని డార్నే! నిన్నొక ప్రశ్న నడుగుమందువా?"

"మనస్ఫూర్తిగా మీ యుపకారమునకుఁ బ్రతీకారము."

"నేను దప్పక నిన్నుఁ బోలియుంటినని తలంతువా?"

''నిజముగా కార్టన్! నే నా విషయమును బ్రశ్నించు కొనలేదు."

''ఇపుడు ప్రశ్నించుకొనుము.''

''మీరు నావలె నుండునటుల వర్తించితిరి. కాని నన్ను

బోలియుంటి రని నేను దలంపను.''

"నేను నట్లే తలంచుచుంటి"నని కార్టను సమాధానము చెప్పెను.

డార్నే గంటను మ్రోయింప యత్నించుచు "నేను మన మనయిరువురి పైకమును జెల్లించుచో నేమియు నాటంక ముండ దని తలంతు ననెను.

"ఏమి యాటంకము లేదు."

డార్నే పిలుపుగంటను మ్రోయించెను. అదివిని యొకసేవ కుఁడు లోనికరుదెంచెను. కార్టను వానితో "నిటువంటి ద్రాక్షా రసమునే యింకొక పిన్టు గొనిరమ్ము. పదిగంటలకు వచ్చి నన్ను లేపు" మనెను.

పైకము చెల్లించి డార్నే లేచెను. కార్టనునకు నమస్క రించి వీడుకొనెను. కార్ట నొంటరిగా నుండెను. అతఁడొక వెలుఁగుచున్న మైనపుటొత్తిని జేతఁగైకొని యచట నొక గోడకుఁ దగిలించిన యద్దము దగ్గరకరిగెను. అందులోఁ దనరూపమును జాగరూకతతోఁ బరిశీలించెను.

"నీవాతనిని బోలియుంటివా? నిన్నుఁ బోలినయొక వ్యక్తివలె నీ వేలఁయుండవలయును? నీయం దాదరింపఁదగిన గుణ మొక్కటైనను లేదు. అది నీ వెఱుఁగుదువు. నీ వే స్థితియం దుండెడివాఁడవో నీ కాతఁడు జ్ఞాపకముచేయుటతప్ప మఱేమియు నొనరించినదిలేదు. నీవాతని స్థితియందున్నచో నాతని జూచి నటుల నామె నీలివన్నెకనులు నిన్నుఁజూచునా? అతని యందు వలె నావేదనాపూరితమగు నామె ముఖము జాలి గనుపఱు చునా? మర్మము వదలి వచింపుము. నీవాతనియం దసూయ

పడుచుంటి” వని యద్దములోని తన నీడతోఁ గార్టను గొణుఁగు కొనెను.

మనశ్శాంతి కొఱకు మిగిలిన ద్రాక్షారసము నంతయుఁ గొలది నిమిషములలో డాగెను. చేతులపైఁ దలనిడుకొని నిద్రించెను.

---

## మూడవ ప్రకరణము

ఎవర్మాండి ప్రభువగు మార్క్విసఱువదియేండ్లవాఁడు. మిక్కిలి క్రూరస్వభావుఁడు. అతఁడొకనాఁ డమూల్యవస్త్రాభరణములను దాల్చి పారిసునగరములోని సన్నవీధిగుండ బండిలోఁ బోవుచుండెను. బండివాఁడు విరోధులమీఁదికి దూకించు సైనిక దళములవలె గుఱ్ఱము నతివేగముగాఁ దోలుచుండెను. ప్రకృతి జనులు వానిముందు చెల్లాచెద రగుచుండిరి. కొందఱు కొలది వాసిగాఁ బ్రమాదములనుండి తప్పించుకొను చుండిరి. కొందఱు క్షతకాయులయ్యును బ్రాణాపాయము నొందక బ్రతికి బైటఁ పడుచుండిరి. బండివాని నిర్లక్ష్యభావమును యజమాని వారింపఁ దలఁపనైనఁ దలంచుటలేదు. ప్రక్కఁగాలిబాటలులేని వీధులం దీరీతి శరవేగముతో బండిని దోలుట జనుల కపాయకరమును రాక్షసకృత్యము నని యెవరెంత కేకలిడుచుండిన నాలించు వారైనను లేరయిరి. కావున బీదసాదలు వారివారి వీలును బట్టి యపాయమునుండి తప్పించుకొను నుపాయములను జూచుకొనుట వారికే విడచిపెట్టఁబడెను.

భయంకరమై కిఱకిఱమను నిరుసు మ్రోతలతోడను, చక్ర

ముల కుదిలింపులతోడను గుఱ్ఱము గిట్టల చప్పుడులతోడ నా శక టము మూలమలుపులు తిరుగుచు మనోవేగవాయువేగముల నతిక్రమించి పోవుచుండెను. స్త్రీలు భయమునఁ గేకలు పెట్టు చుండిరి. పురుషు లొండొరులనుబట్టి లాగుకొనుచుండిరి. పిల్ల లను శకటమార్గమునుండి ప్రక్కల కీడ్చుకొని పోవుచుండిరి. తుద కా శకట మొకమలుపు తిరిగెను. అచట నొక కాలువయి కలదు. అది యొక యిఱుకుమార్గము. బండిచక్రములు కుదిలింపఁ బడెను. వెంటనే యధికసంఖ్యాకములగు కంఠధ్వను లొక్క పెట్టున మిన్నుముట్టెను. గుఱ్ఱము వెనుకకుఁ గుదిలపడి నిలిచి పోయెను.

తఱచుగా నెన్నిప్రమాదములు తటస్థించినను బరిశీలింప కయే నిరాఘాటముగా బండితోలుకొని పోవుచుండు నలవాటు కలదు. కాని యీనాఁడు చోదకుఁడు భయపడి క్రిందికి దూకెను. పెక్కుమంది గుఱ్ఱముల కళ్లెములను బట్టుకొని బండి నాపిరి. కావున నాగిపోవలసి వచ్చెను.

మార్క్విసు బైటికిఁ దల నిగిడించి చూచుచు "నేమి జరిగినది" యని యడిగెను.

ఒక పొడుగుమనుష్యుఁడు గుఱ్ఱముల కాళ్ల మధ్యనుండి యొకకట్టను దీసికొనిపోయి కాలువయి యరుగుమీఁద నుంచెను. వాఁడు బురదలో మోకరించి మూటమీఁదఁబడి యడవిమృగము వలె రోదన మొనరించుచుండెను.

"ప్రభూ! క్షమింపుఁడు, శిశువు" అని యొకఁడు వినయ ముగా సమాధానము చెప్పెను.

"వాఁడు లోకమంతయు ముంచుకొని పోయిన ట్లేడ్చు

చుండెను. వాని బిడ్డయా?"

"ప్రభూ! క్షమింపుఁడు. అవును."

ఆ పొడుగరి నేలమీఁదనుండి తటాలున లేచి బండివైపునకుఁ బరుగెత్తికొని వచ్చెను. మార్క్వెసు కోపాతిరేకమునఁ దన చేతిని దొండినున్న కత్తి పిడిమీఁదికిఁ బోనిచ్చెను. కాని మఱల నాలోచించి యూరకుండెను.

ఆ మనుజుఁడు హతాశుఁడై యధికశోకావేశమున రెండు చేతులను మింటివంకకుఁ జాచుచుఁ "జచ్చెను, జచ్చె" ననుచుఁ బ్రలాపింప నారంభించెను.

జనులందఱుఁ జుట్టుమూగి మార్క్వెసు వంకఁ దేరి చూచుచుండిరి. కాని యొక్కని ముఖమునందును గోపముగాని యసూయగాని యగుపించలేదు. ఒకమాటయైనను వారినోట వెడలలేదు. కోలాహలము వెంబడిఁ బ్రశాంతము నెలకొనెను. అందఱిరిచ్చపడి మంత్రబద్ధములైనసర్పములవలెఁజూచుచుండిరి. వారి నిశ్వాసములం దసమర్థతయు నశాంతియు స్ఫురించుచునే యుండెను. కన్నీటికణ మొక్కటి రాల్చుటతప్ప వారొనరింపఁ గలిగిన దేమియుఁ గానరాలేదు. మార్క్వెసు వారివంక నప్పుడే కన్నములోనుండి బైటికి వచ్చిన యెలుకలను జూచినటుల నొక చూపుఁబఱపించెను. అందునిరాదరణము, నిర్లక్ష్యము, నేహ్యము మూఁడువరుసల ముప్పిరులు తిరిగి మెలివేసికొని యుండెను. జేబునుండి డబ్బుసంచిని దీసెను.

"ఇది చాలవిపరీతముగా నున్నది. మిమ్ములనుగూర్చియు మీ పిల్లలను గూర్చియు నజాగ్రత్తగా నుందురు. తగుశ్రద్ధ తీసికొనరు. ఎవరో యొకరు దారియందు బండికడ్డము వచ్చు

చుందురు. నా గుఱ్ఱములకెట్టి ప్రమాదము వాటిల్లెనో తెలియ కున్నది. ఇదిగో వాని కిది యిచ్చి పంపివేయుఁడు."

అతఁడొక బంగారు నాణెమును బండివానిముందరకు విసిరి వేసెను. దాని వంక నందఱుఁ బరికించిరి. ఆమనుష్యుడు మఱల నుచ్చైస్స్వరముతో మఱల "మరణించెను, మరణించె" నని వాపోయెను.

అప్పుడొక నూతనవ్యక్తి యాప్రదేశమున కరుదెంచెను. వాని కచ్చటనున్నవారు దారినొసఁగిరి. వానిని జూచిన వెంటనే యతఁడు బిగ్గరగా నేడ్చుచు నతని భుజములను గౌఁగిలించు కొని కొళాయివంకఁ జూపించెను. అచట నొకయువతి యచేత నమై పడియున్న శిశుశవముపైఁబడి ముక్తకంఠముతోఁ గడుపు తఱుగుకొని పోయినటుల విలపించుచుండెను. వారందఱుఁ గన్నీరు గార్చిరి.

"నాకంతయుఁ దెలిసినది. సర్వము గ్రహించితిని. గాస్పర్డ్! నిరుపేద జీవించుటకంటె మరణించుట యుత్తమము. ప్రయాస పడక క్షణములో మృతినొందెను. ఇంతసుఖముగా నాజీవి తొుక గంటయైనను గడపఁగలిగెనా?"యని యా నూతనుఁడు నుడివెను.

"నీవు వేదాంతివి. సత్యముపలికితివి. నీ పేరేమి?" యని మార్క్విసు ప్రశ్నించెను.

"డిఫార్జి."

"వ్యాపారము."

"పానశాల."

మార్క్విసింకొక బంగారు నాణెమును విసరుచు, "సిది

తీసికొనుము. వేదాంతీ! నీయిష్టము వచ్చినటుల ఖర్చుపెట్టుము. గుఱ్ఱములకుఁ బ్రమాదము కలుగలేదుకదా?"

మార్క్విసు యథాకీతిఁ జేరగిలఁగూర్చుండి "యింక బండిని బోనీ"మ్మనెను: శకటము బయలుదేర నుండెను. ప్రమాదవశమున నేదో యొకవస్తువును బగులఁగొట్టి దాని వెల వాపసుచేసి కృతార్థతను బొందినవానివలె నాతని భావము సంతృప్తినొందెను. అంతలో నొకనాణె మాబండిలోని కేగిరి వచ్చి పడెను. అది పరికించి మార్క్విసు "ఆపు - గుఱ్ఱముల నాపుము. ఎవ రా విసరినది'' యని గద్దించెను.

సారా వ్యాపారస్థుఁడగు డిఫార్జి క్షణముక్రింద నిలిచిన ప్రదేశము వంకకుఁ దనచూపు మరలించెను. దురదృష్టవంతుఁడగు గాస్పర్డా ప్రదేశమున మోమును నేలమీదనుంచి వెక్కి-వెక్కి- యేడ్చుచుండెను. అతనిప్రక్కన స్థూలకాయ యగు నొక యువతి నిలుచుండెను. ఆమె యొక రుమాలు నల్లుచుండెను. ఆమె డిఫార్జిసతి.

"కుక్కలారా! నిలుఁడు. నాయిష్టమువచ్చినటుల మిమ్ముల నందఱను గుఱ్ఱములచేతఁ ద్రొక్కించెదను. భూమి భారము తొలఁగించెదను. చక్రములక్రింద నలిపివేయించెద"నని కోపారుణితనయనుండయి గర్జించెను.

అతఁడేమి చేయునోయని వారందఱు భయమునఁగంపించి పోయిరి. కాని డిఫార్జిసతి మాత్ర మాతనివంకఁ గన్నార్పక యరయుచుండెను. ఆమెవంకఁ జూచుట యతని గౌరవమునకు భంగకరమని మార్క్విసు తలంచెను. అతని నిందాపూరితమగు దృక్కుల నామెవంకను నా జనమువంకను బరపించెను.

మఱల వెనుక కానుకొని కూర్చుండి "పోనిమ్ము" అని బండివాని కాజ్ఞాపించెను.

---

## నాల్గవ ప్రకరణము

మనోహరమగు భూప్రదేశము. సస్యలక్ష్మి బంగారు వన్నె మిసమిసలను దుసికిలించుచు నయనానంద మొదవించు చుండెను. మధ్యమధ్య జొన్న సిలువెత్తునఁ బెరిగి ఫలోన్ముఖ మున కరుడెంచెను. విడిగా బటానీలు, చిక్కుడు, ఉరలగడ్డ మొదలగు కూరమొక్కలు పెరిగి పెద్దవగుచుండెను. పొలము లందు స్త్రీపురుషులు పాటుపడి పనిచేయుచుండిరి. కాని వారి ముఖములు వికాసహీనములు, కన్నులు తేజోరహితములు, శరీరములు శుష్కీభూతములు. నిరాశ, చీఁకటులు జీరాడు చుండెను.

ఆ గ్రామమునం దొక వీథి మాత్రమే కలదు. అందొక చిన్న దుకాణము, దాని సమీపమున నొక కల్లుపాక. ఒక గుజ్జుపుశాల. గ్రామమున కంతకు నొక కుళాయి. జనులు దరిద్రులు, తినఁదిండియుఁ గట్టఁబట్టయుఁ జాలినంత లేదు. వృద్ధాంగనలు వాకిళులందుఁ గూర్చుండి రాత్రి భోజనమునకై దుంపలను దఱుగుచుండిరి. కొందఱు యువతీయువకులు కొళాయి యొద్ద తమకు భూదేవి ప్రసాదించిన గడ్డి, యాకులు, నలకములు కడుగుచుండిరి.

ప్రభుత్వపుఁ బన్ను, మతాచారుల పన్ను, గుడికొఱకుఁ బన్ను, ప్రభువులకుఁబన్ను, ప్రత్యేకపుఁబన్ను, సామాన్యపుఁ బన్ను, నిచ్చట నచ్చట చెల్లింపవలయును. పన్నుకొఱకు గోడ

తాఖీదులు, వానిని జెల్లింపని వారికిఁ గఠినశిక్షలు, శిక్షలకుఁ దోడు కక్షలు; స్త్రీలు మానముకొఱకుఁ బురుషులు ప్రాణము కొఱకుఁ బెనగులాడవలసి వచ్చుచుండెను. జను లీ బాధలను సహింపలేక పాఱిపోవుచుండిరి. గ్రామము పాడుపడెను. పూర్వపు టౌన్నత్యము నశించెను.

ఎవర్మాండిప్రభువు నాలుగుగుఱ్ఱములచే లాగఁబడు చున్న యొకశకటము నధిరోహించి వచ్చెను. బండి సుంకపు మెట్టును సమీపించెను. అచట గుఱ్ఱములను మార్చుకొనుట కాగెను. మార్క్విసు కొలఁది చుట్టుపట్టులందలి యస్వతంత్రు లైన జనుల ముఖము లొకసారి యవలోకించెను. ఆమూపులు నిందాగర్భితములు, క్రోధపూరితములు. అసూయాజన కములు. కొలదిసేపటిలో నొకబాటలను బాగుచేయువాఁ డచ టికి వచ్చెను. మార్క్విసు బండివానితో "వాని నిటకుఁ గొనిర" మ్మని యాజ్ఞాపించెను. వాఁడు కొనిరాఁబడెను. అచటి వారం దఱు నేమి మూఁడనున్నదో యని చుట్టుమూఁగి చూచుచుండిరి.

"నేను నిన్ను దారిలోఁ గలిసికొంటిని కాదా" యని మార్క్విసు ప్రభు వడిగెను.

"అవును ప్రభూ!"

"నీవు దేనిని బరికించి చూచితివి?"

"ప్రభూ! ఒకమనుష్యుని."

వాఁడు వంగి గడగడ వణకు టోపీతో బండిక్రిందఁ జూపెను. అచటి వారందఱు బండిక్రిందఁ జూచుటకు వంగిరి.

"ఏమనుష్యుఁడురా. పంది! ఎందు కక్కడ చూచితివి?"

"ప్రభూ! క్షమింపుడు. వాఁడు గొలుసును బట్టుకొని

వ్రేలాడుచుండెను."

"ఎవఁడురా?"

"ఆ మనుష్యుఁడే ప్రభూ!"

"ఆ మనుష్యునిపేరేమి? నీ వీ గ్రామము నందలి వారి నెఱుఁగుదువుకదా? వాఁడెవఁడు?"

"అత డీ గ్రామపరిసరములందలివాఁడు గాఁడు. నాజీవితములో వానిని నేనెన్నఁడుఁ జూడ లేదు."

"గోలుసుపట్టుకొని వ్రేలాడుచుండెనా?"

"అవును ప్రభూ! అదియే వింత. అతనితల యిట్లు వ్రేలాడుచుండెను."

అతఁడు బఁడి ప్రక్కకుఁ దిరిగి వెనుక కొఱిగి ముఖమాకాశము వైపుననుంచి తల వ్రేలవైచుచుఁ జూపెను.

"వాఁడె ట్లుండెను?"

"ప్రభూ! పిండిపురుగువలెఁ దెల్లగా నుండెను. పెనుభూతమువలెఁ బొడుగుగా నుండెను."

"మంచిపని చేసితివి. ఒక దొంగ నా బండిని వెంబడించుచుండగా నోరు కదల్పకుంటివి. గాబలి! వీని నిచటనుండి గెంటివేయుము."

గాబలి తపాలకచేరియధికారి. పన్నులను విధించు నుద్యోగి. అతఁ డచటికి వచ్చి నిలచెను.

"పో! అవతలికి పో!" యని గాబిలు వాని నదలించెను.

"ఈ రేయి యాదొంగ యీ గ్రామమునకు వచ్చినచో వానిని గనిపెట్టియుండుము."

"ప్రభూ" చిత్త మని గాబలి యనెను.

## ఐదవ ప్రకరణము

ఎవర్మాండి భవనము మిగుల రమణీయమైనది. అందుఁ బెక్కుగదులు గలవు. అవియన్నియు నానాటి మహారాజులకు భోగ్యములగు సర్వనాగరకతావస్తుసముదాయములచే నలంకరింపఁ బడియుండెను. దానిముందు విశాలమగు బహిఃప్రదేశము గలదు. అందు రెండువైపులనుండి రెండు సోపానపంక్తులు నిర్మింపఁబడెను. అవి మేడమీఁది ముఖద్వారము ముందు డాబాపైఁ గలియును. ఆ సౌధమునకుఁ జుట్టు చలువరాతి వేదికలు, ప్రతిమలు, జలయంత్రములు, లతాగుల్మములు, వృక్షకదంబములుఁ గన్నుల కింపు గావించును.

కాగడాను జేతఁబట్టుకొని యొక సేవకుఁడు వెంబడినే తెంచుచుండ మార్క్విసు మేడమెట్ల నెక్కెను. సింహద్వారమును దాటి మనోహరములగు గదులగుండఁ బోవుచుండెను. అవియన్నియుఁ జిత్రవిచిత్రవస్తుసముదాయముతోడను వింతవింతలగు చిత్రలేఖనముల తోడను నయనానందకరములుగా నుండెను. ఆగదులలో నొకదానియందు నిరువురకు భోజనము బల్లపై నమర్చఁబడియుండెను. అది యందమగు చిన్నగది. దాని యందలి కిటికీల కద్దము లమర్చఁబడెను. చంద్రకాంతులు వానిపైఁ బ్రసరించి వివిధవర్ణములతోఁ దచ్ఛాయలు లోని కరుదెంచుచుండెను.

"చార్లెసుకుమారుఁ డింగ్లాండునుండి యింకనురాలేదా?" యని మార్క్విసు ప్రశ్నించెను.

"చిత్తము ప్రభూ! ఇంకను రాలేదు."

మార్క్విసు దుస్తులను మార్చుకొని పావుగంటలో

భోజనమునకు సంసిద్ధుఁడయ్యెను. అతనికుర్చీ కిటికీ కెదురుగా నుంచెను. మాంసరసమును సేవించెను. ద్రాక్షారసము నొక పాత్రలోఁ బోసికొని నోటిదగ్గర పెట్టుకొనెను. వెంటనే బల్ల మీఁద నుంచెను. కిటికీలోనుండి తేఱిచూచుచుఁ బ్రక్కనున్న సేవకునితో "అదేమి?" యని ప్రశ్నించెను.

"ప్రభూ! అదియా?"

"కిటికీ తలుపులను దెఱువుము".

సేవకుఁడు తలుపులు దెఱచెను.

"మంచిది."

"ప్రభూ! ఏమియు లేదు. చెట్లనీడ."

సేవకుఁడు కిటికీలోనుండి వెలుపలకుఁ దల నిగిడించి యిటు నటు బరికించెను. మఱల వెనుదిరిగి యాజ్ఞకై యెదురు చూచు చుండెను.

"తలుపులు మూయుము."

సేవకుఁ డట్లుగావించెను. మార్క్విసు భోజనము చేయు చుండెను. సగ మైనది. అంతలో బండి చప్పుడు వినవచ్చెను. మార్క్విసు చెవి నిక్కించి యాలించుచుండెను. అపు డతని యన్న కుమారుఁడు లోని కరుదెంచెను. ఆయనను చార్లెసు డార్నే యని యింగ్లాండునందుఁ బిలుచుచుందురు.

మార్క్విసు వానికి స్వాగత మొసఁగెను. కాని కర స్పర్శము కావింప లేదు. డార్నే బల్ల కింకొకవైపున గుర్చీమీఁదఁ గూర్చుండెను.

అచ్చట సేవకు డున్నంతవఱకు వారు ముఖ్య విషయము లను గూర్చి యేమియు మాట్లాడ లేదు. కాఫీ పానీయము

త్రాగిన తరువాత వారిరువురు నొంటరిగా నుండిరి. అప్పుడు డార్నే యిట్లు నుడివెను.

"మీ రూహించినటుల వెళ్లిన పనిమీదనే మఱల రావలసి వచ్చినది. ఆప్రయాణమువలన నేను ప్రాణాపాయము పాలైతిని. మరణమే ప్రాప్తించినచో నే కష్టము లేకుండెడిది."

మార్క్విసు మిగుల నాశ్చర్యమును వెలిబుచ్చెను.

"నాకు మరణము ప్రాప్తించినచో మీరు సహాయ మొనరించుటకు వ్రేలైనను గదలించెడివారు కారని తలంతును."

ఆమాటలకు మార్క్విసు రిచ్చపడెను. అది బాహ్యగతమే కాని మనోగతము కాదు.

తన కింగ్లాండునం దాపదకుఁ గారణమగు నాచూకి నిచ్చిన యా వేఁగుల వానిని దలఁచి డార్నే "నిశ్చయముగా నేను విషమపరిస్థితులం దున్నప్పుడు మీరు మఱింత విషమ పరిస్థితిని దెచ్చిపెట్టుటకు బాహాటముగాఁ బ్రయత్నించితిరి. ఇందాశ్చర్య మేమియు లేదు" అనెను.

"లేదు. లే"దని మార్క్విసు వెంటనే తప్పుకొన యత్నించెను.

"అది యెట్లున్నను నన్ను మీరు బాధింపఁ దలంచితిరి. మీకు దైవభీతిలేదు. ధర్మము శూన్యము. డార్నే మార్క్విసు వంక ననుమానకలుషితమైన దృష్టిని బరపించెను. అందసూయాద్వేషము లిమిడియుండెను.

"మిత్రమా! నే నట్టివాడనే యగుదును. నీతో నేను ముందనిన మాటల నొకసారి తలంపునకుఁ దెచ్చుకొనుము. నీకే సర్వము వ్యక్తము గాఁగలదు."

"ఆ! జ్ఞాపక మున్నది."

"మంచిది" అని మృదువుగా సమాధానము చెప్పెను.

"అయ్యో! దానిఫలితముగా నీ దురదృష్టమే నన్ను ఫ్రాన్సునందుఁ గారాగృహావాసమునుండి తప్పించిన దని తలంతును"

"నీమాటలు నాకు సరిగా నర్థముకాలేదు. విపులముగాఁ జెప్పుమని యడుగవచ్చునా?"

"ప్రభుత్వమునకు నీయందాదరణము నశించినది. కొన్ని సంవత్సరముల నుండియు నిన్న గౌరవమేఘము లావరించి యుండెను. లేకున్నచో రిత్త తాఖీదులను బూరించి నన్నే దుర్గమునందో యావజ్జీవము కారాగృహాబద్ధుని గావించెడి వాఁడవు."

"అది సాధ్యమే. వంశగౌరవము కొఱకు నిన్నట్టి యిక్కటులు పెట్ట నిశ్చయించుకొంటిని. కాని దురదృష్టమువలన నట్టి లేఖలు లభించుట యీకాలమునందుఁ గష్టమగుచున్నది. చాల మంది వానికొఱకు యత్నించుచుండిరి. కాని కొలఁదిమందికి మాత్రమే యవి లభించుచున్నవి. ఈవిషయములందు ఫ్రాన్సు హీనదశకు దిగినది. మనకులము చాల యధికారములను గోలు పోయినది. క్రొత్తవేదాంతములు రేగినవి. మన యధికార ములు నిలువఁబెట్టుకొనుట కష్టముగా నున్నది."

మార్క్విసు చిటికెడు పొడుమును బీల్చి చేతిని జాడించెను. డార్నే ముఖము ముకుళించుకొని పోయెను.

"ఫ్రాన్సునందు మనమందరికంటె నధికముగా నిందింపఁ బడుచుంటి" మని యతఁడనెను.

"అట్లే మన మనుకొందము. గొప్పవారిని నిందించుట నీచుల స్వభావము."

"అయ్యో! మనము మహాపాపము చేసితిమి. మన భోగానుభవముల కడ్డము వచ్చినవారి నెల్ల మృత్యుముఖమునఁ బడఁద్రోసితిమి. బాధల పాలొనరించితిమి. మన వంశీయులవర్తనము నాకు గర్హ్యముగా నున్నది. నాజనని మరణసమయమున నన్నీ క్రూరకార్యములను రూపుమాపుమని వేడికొనినది. అట్లు గావింప యత్నింతును. ప్రస్తుత మేమియుఁ జేయఁజాలనని నే నెఱుఁగుదును. ఎప్పటికైన జమీ నా వశమగునేని మిగిలిన జనులైనను బాధపడకుండుటకు యత్నింతును."

"ఈ క్రొత్త వేదాంతముతో నీ వెట్లు జీవింతువు?"

"కష్టపడి పని చేయుదును."

"ఇంగ్లాడులోనా?"

"అవును. మన వంశనామమున కగౌరవముఁ గొనిరాను. ఇది నిశ్చయము. మాఱు పేరుతో నివసింతును."

మార్క్వీసు చిఱునవ్వు నవ్వెను. అందుఁ గ్రౌర్యనిందా భావములు ప్రతిఫలించుచుండెను. అతని స్వభావమునందు మార్పు కలుగలేదు. డార్నేను వీడుకొలిపి శయ్యాగృహమును జేరెను.

మార్క్వీసు శయ్యపైఁబరుండెను. పావుగంట గడచినది. అతనికన్నులముందు నాటిదృశ్యము లొకటివెంట నింకొకటిగా గోచరించుచుండెను. పారిసులోని కొళాయి, పొడుగరియగు మనుజుఁడు, అతని మరణించిన శిశువు, మీఁదఁబడి రోదన మొనరించు జనని, రోడ్లను బాగుచేయువాఁడు నుడివినకథ,

భూతమువలె బండిక్రింద మనుష్యుఁడు వ్రేలాడుట, భోజనము చేయునపు డగుపించినదృశ్యము నాతనిని దాఱుమాఱొనరించు చుండెను. కాని వాని కొండొంటితో సంబంధము కలదని యాతఁ డూహించలేదు. క్రమక్రమముగా నిద్రాదేవి యాతని నావహించెను.

తెల్లవారినది. సూర్యుఁ డుదయాద్రి నధిష్ఠించెను. మార్క్విసు ప్రక్కమీద విగతజీవుఁడై పడియుండెను. వాని హృదయమునందుఁ జిఱుకత్తి చొచ్చుకొని యుండెను.

---

## ఆఱవ ప్రకరణము

ఒక సంవత్సరము గడచినది. ఎవర్మాండి జాగీరుమీద డార్నే తన హక్కులన్నిటిని వదలుకొనెను. ఇంగ్లాండునందు ఫ్రెంచిభాషోపాధ్యాయుఁడుగాఁ బనిచేయు చుండెను. బోధనా పద్ధతియం దమితవిఖ్యాతిని గడించెను. లండనులో దోషవిచారణఫలితముగా డార్నే, కార్టను, స్ట్రైయివరులు మానటికి నాయన కుమార్తె యగు ల్యూసీకిని ప్రాణమిత్రులైరి. సోహో యందలి మానటె శాంతిసదనమునకు వారు తఱచుగా వచ్చుచుఁ బోవుచుందురు.

విచారణ నాటినుండియు డార్నే ల్యూసియందు బద్ధానురాగము కలవాఁడయ్యెను. జాలిఁగొలుపు నామె కంఠస్వరము వంటి మృదుమధురమగు స్వరము నాతఁ డెప్పుడును వినియుండ లేదు. మృత్యుముఖమునందుఁ జిక్కుకొనినప్పు డాతని నాశ్వాసించిన యామె ముఖమువంటి మనోహరకోమలమగు నాస్యము నాతఁ డెందును జూచియుండలేదు. కాని తనప్రణయ

గాథ నాతఁ డెన్నఁడు నామెతో ముచ్చటించలేదు.

గ్రీష్మకాలమున నొకనాటి సాయంకాలమునందు ల్యూసి యింటలేదని తెలిసికొని మానటితో నీవిషయమును ముచ్చటింప డార్నే నిశ్చయించుకొనెను.

సావడిలోని కిటికియొద్దఁ బడకకుర్చియందుఁ గూర్చుండి మానటి పుస్తకము చదువుకొనుచుండెను. ఆయన కారాగార నివాసము వలనఁ గోల్పోయిన శక్తిసామర్థ్యములను బాగుగాఁ బుంజుకొనెను. ఇప్పు డాయన దార్ఢ్యముగలిగి బుద్ధికుశలతయుఁ బ్రజ్ఞయుఁ గలవాఁ డాయెను. నూతనముగాఁ గోలుకొనిన యాశక్తియం దప్పుడప్పుడు సంచలనము కలుగుచునే యుండెను. కాని యది క్షణభంగురము.

మానటి రాఁబోవుపరిస్థితులను దూరదృష్టివలన గ్రహించి తన కుమార్తెనుగూర్చి మాట్లాడుట కనిష్టతను డార్నేకు సూచించెను. డార్నే యది గుర్తించియు ల్యూసీయెడఁదనకుఁగల యనురాగమును నాసక్తియు నాదరమును మానటికి నెఱిగించెను. తండ్రికుమార్తెలు పరస్పరప్రేమాదరములతో వర్తించుచుండిరి. చిరకాలవియోగానంతరము వారి కలయిక ప్రగాఢానురాగమునకు దారి దీసెను. అది క్రమక్రమముగా నవినాభావసంబంధమునకుఁ దారాకాణమయ్యెను. అది యెడఁబాయరానిది. లూసీని విడచి మానటిగాని మానటినివిడిచి ల్యూసిగాని యొకక్షణమైన నుండజాలరు. కావున డార్నే ల్యూసీతోఁగాని యామె జనకునితోఁగాని యెన్నఁడు దన ప్రణయమును వెల్లడించి వారి హృదయములందు వియోగబీజములను వెదజల్ల సాహసింపలేదు. నానాటి కది యభివృద్ధినొందిి

భరింపరాని దయ్యెను.

డార్నే మానటితో నిట్లనెను.

"అయ్యా! మానటి! నాకు సర్వముఁ దెలియును. మీ రిరువురు నెడ తెగని పవిత్రమగు ప్రేమజ్యోతిలో వెలుఁగుచుంటిరి. నేను మానవప్రకృతికి సాధ్యమగు నంతవఱకు నా ప్రేమ భావమును హృదయమునందు భరించితిని. నా యనురాగవాహినిని మీయిరువురి నడుమను వెల్లిగొలిపి మీజీవితములను వేఱుగావించుట యుక్తముకాదని తలంచితిని. కాని నే నామెను మనఃపూర్వకముగాఁ బ్రేమించుచుంటిని. దానికి దైవమే సాక్షి."

"నాకు నీయందు నమ్మకము కలదు. నేనును దీనిని గూర్చియే యింతకుముం దనుకొంటి"నని మానటి విచారముతోఁ బలికెను. దీన మగు నాయన కంఠస్వరము డార్నేకు విషాద జనక మయ్యెను.

"అయ్యా! నేనామె నర్ధాంగిగా నొనరించుకొను నదృష్టమే కలిగినచో మీ యిరువురి ప్రేమానుబంధమున కెన్నడు నంతరాయము కల్పింపను. నామాట నమ్ముఁడు. నేనాడినమాటఁ దప్పువాఁడనుగాను. తండ్రియొడిలోని బిడ్డను వేఱుచేయుట నీచ మని నే నెఱుఁగుదును."

"మానటి! మీవలెనే నేనును నాస్వదేశమగు ఫ్రాన్సు నుండి వలసవచ్చితిని. తమవలెనే యచ్చటి విషాదసంఘటనల వలనను, దౌష్ట్యములవలనను నుపహతి నొందినవాఁడ నైతిని. భావికాలమునందు సుఖము నాశించి చిక్కుల కష్టమువలన మీవలెనే యదృష్టవంతుఁడను గాఁదలఁచితిని. నా మరణ పర్యంతము మీసుఖదుఃఖములందును జీవితమునందును నదృ

ష్టమునందును భాగమును బంచుకొన నిశ్చయించుకొంటిని. మీకుఁ దనయయును మిత్రురాలును సహవాసినియు నగు లూసీస్వాతంత్ర్యమునకు నేనెట్టి భంగమును గలిగింపను. ఆమెకు సహాయ మొనరించుచుందును. ఆమెను మీకు మఱింత ప్రేమాస్పదురాలినిగా నొనరింతును."

ఆరంభమునుండి యింతవఱకు మానటి డార్నే వంకఁ గన్నెత్తియైనను జూడలేదు. ఇపుడు తనచేతులను గుర్చీచేతులపై నానించి యాతనివంక మొదటిసారి చూచెను. ఆముఖమునందు భయసందేహములు గోచరించుచుండెను.

"డార్నే! నీవు మిగుల గనికరముగా గంభీరముగా వచించితివి. అందులకు నేను గృతజ్ఞుడను. సత్యముగా నకల్మషముగా నీవు పలుకుచుంటి వని నా నమ్మకము. నాతనయకును నాకును గల యనురాగమున కంతరాయము కల్పింపనని నీవు వచించితివి. ఆమె సంపూర్ణసుఖానందములకు నీవు ముఖ్యావసర మని యామె నాతో నెప్పుడైనను దెలిపినచో నామెను నీకుఁ బరిణయము గావించుట యందే యాటంకమును జెప్పను. ఆమె యేకారణము చేతనైనను నన్యునిఁ బ్రేమించుట కలిగనేని యది యాతని తప్పుకాదు. ఆమెకొఱకు నీవన్నియు మఱచిపోవలయును. నాకు సర్వము నామెయే యని నీవెఱుంగుదువు. ఆమెసుఖమే నాసుఖము. ఆమె యానందమే నాయానందము. ఆమె కొక విషాదము వాటిల్లిన నేనెట్లు జీవింపఁగలను."

మానటి యాతనివంక నిశ్చలదృష్టితోఁ జూచెను. ఇంక నాయన నోటినుండి మాటరాలేదు.

డార్నే రెండుమూఁడు నిమిషము లూరకుండెను. మఱల

నిట్లనెను.

"అయ్యా! మీరు నన్ను నమ్మితిరి. నేను మిమ్ము నమ్ము చుంటిని. ఇప్పటి నాపేరు నాదికాదు. నా జనని వంశనామము ననుసరించి కొలఁదిగా మార్చుకొంటిని. నానామమును నే నింగ్లాండునందున్న కారణమును మీకుఁ జెప్పదలంచితిని."

"ఆగుము."

"మీ నమ్మకమునకు నేను పాత్రుఁడను. మీకడ నాకు రహస్యము లేదు."

"ఆగుము."

మానటివైద్యుఁడు వినుట కిష్టములేక రెండుచేతులతో రెండుచెవులను మూసికొనెను.

"నే నడిగినపుడు చెప్పుము. ఇప్పుడు కాదు. నీప్రేమ విజయవంతమయి లూస్యాసి నిన్నుఁ బ్రేమించినపుడు నీ వివాహ సమయమునఁ దెల్పుము. చెప్పెదువా?"

"మనఃపూర్వకముగా"

"ఏదీ, నీచేయి యిటు తెమ్ము. ఆమె యింటికివచ్చువేళయి నది. ఈరేయి మనమిరువురము కలిసికొనినటుల నామె నెఱుఁగ రాదు. ఇంక నీవు పొమ్ము. దైవము నీకుఁ దోడ్పడుఁగాక.

---

## ఏడవ ప్రకరణము

సిడ్నీకార్టను తెలివికలవాఁడు. అనేకపర్యాయములు మానటి వైద్యుని శాంతిసదనమునకు వచ్చుచుఁ బోవుచుండును. వారితో నిష్టాగోష్ఠిగ సంభాషించుచుండును. అతని హాస్యప్రసంగములకు

ల్యూసి యానందించును. అతని సంభాషణములు సరసములు. రసనమునుండి తేనె జాల్వారుచుండును. కాని యతఁ డప్పు డప్పుడు విచారనిమగ్నుఁడై యుండును. ముఖము ముకుళిత మగును. అది ల్యూసీకి విషాదకారణము. కార్టె నెవరిని లక్ష్య పెట్టువాఁడుకాఁడు. ఐనను మానటి గృహపరిసరవీథులందు సైత మాతని కాదరము మెండు. రాత్రులందుఁ జాలసేపు ప్రొద్దుపోవునంతవఱకు శూన్యహృదయముతో నచట విహరించు చుండును. ద్రాక్షారసముకూడ నాతని నీ యశక్తతనుండి మఱలింపఁజాలకుండెను.

ఒకనాఁడు కార్టను మానటి గృహమున కరుదెంచెను. అతని మేడ చూపింపఁబడెను. ల్యూసి యొంటరిగా నచటనే యేదో పని చేయుచుండెను. కార్టను మెలమెల్లగా నామెను సమీపించెను. ఆమె వానిని జూచి రిచ్చపడెను. కురిచీమీదఁ గూర్చుండ నియమించెను. కార్టను కొంతసే పేమియు మాట్లాడలేదు. ఆమెయు నట్లే యాతనిని జూచుచు నిలుచుం డెను. ఐదాఱు నిమిషములు గతించెను. కార్ట నామెతో సంభా షింప నారంభించెను. మొదటి కొలఁది మాటలతో నామె తల యెత్తి కార్టనువంకఁ బరికించెను. అతని ముఖమునందు వినూతన మగు మార్పామెకు గోచరించెను. అది యామెకు విచారమును గలిగించెను.

"కార్టను! నీ వనారోగ్యముగా నుంటి వని భయపడు చుంటిని."

"మానటి! నే ననుసరించు నా జీవితవర్తనము నా యారోగ్యమున కుచితముగా లేదు."

"ఉత్తమజీవితము ననుసరింపకుండుట విషాదముకాదా?

"దైవ మెఱుఁగును. సిగ్గుపా టగుచున్నది."

"అట్లయినచో నేల మాఱ్చుకొనరాదు?"

ల్యూసి కార్టను ముఖమువంకఁ జూచెను. వానినయనముల నుండి కన్నీటి ప్రవాహములు జాఱుచుండెను. హృదయ మావేదనాపూరితమగు చుండెను. ఆమె మిగుల నాశ్చర్యచకితురాలయ్యెను. గుండె తటతటఁ గొట్టుకొననారంభించెను. శరీరముకంపించెను. కార్టనురుద్ధకంఠస్వరంతో నిట్లు సమాధానమొసఁగెను.

"అది నాకు సాధ్యముకాదు. ఇంతకంటె బాగుపడఁజాలను. అంతకంతకుఁ గ్రుంగి హీనస్థితికి రావలసినదే."

కార్టను దీనస్థితియం దుండగా ల్యూసి యెన్నడుఁ జూచి యెఱుఁగదు. అతని యావేదన కామె పరితపించుచుండెను. విషాదమేఘములు ముఖమునం దావరించెను. మానస ముడికి పోవుచుండెను. ఆమె యట్లగునని కార్టనునకుఁ దెలియును. ఆమెవంకఁ జూడకయే యతఁడు గ్రహించుకొనఁ గలిగెను.

"క్షమింపుము. మానటీ! నిన్నుఁ బ్రార్థించుచుంటిని. నన్ను క్షమింపుము. నేను జెప్పఁదలఁచిన దానిని దయతో నాలింపుము. మానటీ! విందువా?"

"దానివలన నీకు సుఖముగలుగుచో నది నాకు సంతోషమగును."

"నీ దయాస్వభావమునకు దైవము నిన్ను రక్షించుఁగాక!" కార్టనుచేతిని ముఖమునుండి తొలగించుకొని యిట్లనెను.

"ల్యూసీ! నా మాటలకు భయపడకుము. నేను వచించునే విషయమునకు రోదింపకుము. నేను యావనమునందు మర

ణించినవానివలె నుంటిని."

"కాదు. కార్టను! నీ వట్లనకుము. ఇంకముందు నీవు మిక్కిలి యున్నతికి రాఁగలవు. నిశ్చయము."

"ఉన్నతియా! మానటీ! నీ మాట నే నెన్నడును మఱువను. అది నా కసాధ్యము. మానటీ! నేను త్రాగుబోతును, నిరుపయోగిని, దరిద్రుఁడను. నాకా యున్నతి? మానటి! నీ వెంత దయాస్వభావురాలవు. నీ యెదుటనున్న యీ మానవుని ప్రేమ నీ వంగీకరించుట తటస్థించినచో నీ దినమును, గంటయు గుర్తునం దుంచుకొనఁగలఁడు. సుఖమునకు బదులు విషాదము, దుఃఖము, పశ్చాత్తాపము, నగౌరవముఁ గలిగించెడివాఁడు. వానితోఁగూడ నిన్నునుగూలఁద్రోసెడివాఁడు. అప్పుడునాయెడ దయాలవలేశమయినను గలిగియుండ నేర వని నే నెఱుఁగుదును. అట్లు జరుగ లేదు. నేను కృతార్థుఁడను.

''కార్టన్! నేను నిన్ను రక్షింపఁజాలనా? క్షమింపుము. నిన్నుత్తమజీవితమునకు మఱలింపఁజాలనా? నేనింక నే విధము నను నీ విశ్వాసమునకుఁ బ్రత్యుపకార మొనరింపఁజాలనా? కార్టను! ఇది విశ్వాస మని నా తలంపు."

ల్యూసీ కనులనుండి కన్నీరు వర్ష ధారవలె జాలువాఱెను. కొంచె మాగి మఱల వినయముతో నిట్లనెను.

''కార్టను! యీ విషయ మెవరితోడను వచింపకుందువని నాకుఁ దెలియును. నిన్నెట్టి యుత్తమస్థితికిని మఱల్ప లేనందువా?

కార్టను తలనూగించెను.

"మఱల్పఁజాలవు. మానటి! మఱల్పఁజాలవు. నేను జెప్పిన దంతయు వినఁగలిగినచో నీవు నాకొనరింపఁ జాలిన

దంతయు నొనరించినదాన వగుదువు. నా విషాదస్థితియం దైనను నన్నుఁగూర్చి నేనంతగావిచారింపను. నాయాత్మకు నీవు తుది స్వప్నమ వని నీ వెఱుఁగుదువు. నీ జనకునితో నీ వుండు నపుడు ఛాయారూపములైన నాపూర్వభావములు నా యాత్మ నుండి నశించుచుండును. మానటీ! నేను నిన్నెఱిఁగిన నాటి నుండియు నే నొక మనోవేదనచే బాధింపఁ బడుచుంటిని. ఆ భావము నన్నింకఁ గలుషితము గావింప దని నా తలంపు. వృద్ధుల కంఠమునుండి కొన్ని రహస్యములను వినియుంటిని. అవి నన్నును నా భావములను నున్నతికిఁ గొనివచ్చుచున్నవి. అవి యింక నిరంతర మణఁగిపోఁగల వని తలంతును. నా నూతనారంభములను గుఱించి ఛాయామాత్రము లగు తలంపులు గలవు. నా నూతనారంభము సమరముతో సమర మొనరించుట వంటిది. ఇది స్వప్నము. అంతయు స్వప్నము. ఫలితము శూన్యము. అవి యున్నచోటనే యుండును. నీవు నా యుద్రేకమునకుఁ గారణమని నే నెఱుఁగఁ గోరుదును."

"దానియం దేమియు మిగుల లేదా? కార్టను! ఆలో చింపుము. మఱలఁ బ్రయత్నింపుము."

"లేదు. మానటి! లేదు. నే నంతయు నాలోచించితిని. నేను దగనని యెఱింగితిని. ఐనను నీవెట్లు నా భావోద్రేకము లకుఁ గారణమైనది యెఱుఁగఁ గోరుచుంటిని. ప్రస్తుతము నేనొక విదగ్ధ రూపమును దాల్చియుంటిని. నా భావములు రాజి జ్వాలారూపములై ప్రజ్వలించి నన్ను దహించినవి."

"ఇది నా దురదృష్టము. కార్టను! నా తోడి పరిచయము వలనఁ దొల్లిఁటికంటె నీకు మిక్కుటమగు హృదయావేదనము

కలిగించితిని."

"అట్లనకుము. మానటీ! నా మీద నీకు సర్వాధికారము కలదు. నా దీనస్థితికి నీవు కారణము కాజాలవు.

"కార్టను! నీవు వివరించు నీ మనఃప్రవృత్తికి నేనే కారణమని పలికితివి. అట్లగుచో నా ప్రవృత్తితో నిన్ను నేను సేవింపఁ గూడదా? నీవలన మేలు పొందుటకు నాకెట్టి శక్తియు లేదా?"

"మానటి! నేను జేయఁగలిగిన మేలునుగూర్చి నీ కెఱింగించుటకే వచ్చితిని. నిరుపయుక్తమగు నా జీవితశేషమంతయు నీకు నా హృదయసర్వస్వము నెఱింగించితి నని జ్ఞాపక ముంచుకొందును. ఈ సమయమున నీవు జాలిపడఁదగిన విషయ మొకటి నాయందుఁ గలదు.

"మంచిని గూర్చియా, కార్టను!"

"మానటి! నే నీ దినమును జ్ఞప్తిచేసికొనినపుడు నా జీవితములోని తుది విశ్వాసము నీ హృదయమునం దిమిడ్చికొని దాని నెవరితోను జెప్పకుండు వని నమ్ముచుంటిని."

"దానివలన నీకు మనశ్శాంతి కలదేని యట్లే చేయుదును. నీ పరిచితులగు నెట్టి ప్రియమిత్రులతో నైనను నీవు తెలుపరాదు. కార్టన్! ఆరహస్యము నీది. నాది కాదు. దానిని గౌరవింతునని వాగ్దానము చేయుదును."

"కృతజ్ఞుఁడను. దైవము నీకు మేలొనరించుఁగాక." కార్టనామె హస్తము పెదవులతో స్పృశించెను. తలుపు దాపున కరిగెను."

"నే నింక నీ విషయమును బ్రస్తావింతు నని భయపడ

కుము. మానటీ! మఱల నీ విషయమును సూచింపను. నా మరణకాలమునందు నీ పవిత్రమగు జ్ఞాపకచిహ్నమును నా హృదయమునందు ధరింతును. ని న్నభినందింతును. ఆశీర్వ దింతును. నాతుది యాశయమును దెల్పితిని. నానామము, నా దోషములు, నాదుఃఖములు నీ హృదయమునందుఁ బదిలపఱ చితిని."

కార్టను హృదయము పూర్తిగా మాఱిపోయెను. అతనియం దెన్నడుఁ గానరాని విపరీతభావములు పొడచూపినవి. అవి వానిని గ్రుంగదీయుచుండెను. అతని రూపము శోక భారమునఁజిక్కి జీర్ణావస్థను బొందుచుండెను. మానటికి నాతని మాటలు హృదయవిదారకము లగుచుండెను. నౌక జలధిలో మునిగిపోవుచుండెను. దాని కంతుపొంతు గానిపించుటలేదు. బిగ్గరగా నేడువఁ దలంచెను. కాని యది ప్రయోజనశూన్య మని యామె గుర్తించెను.

కార్టను ద్వారము చెంత కరిగెను. ఒకసారి వెనుకకుఁ దిరిగి మానటివంకఁ జూచెను. ఆ చూపులో విశేషము కలదు. అది యామె హృదయమునందుఁ జొచ్చి యావేదన మొనరిం చెను. శల్యమువలెఁ గలంచెను. శతసహస్రశకలములు గావిం చెను. మానటి ముఖమును జేతులందుఁ దాల్చి తలవంచుకొని యేడువ నారంభించెను.

"ఊఱడిల్లుము. మానటి! ఊఱడిల్లుము. ఇట్టి నీసాను భూతికి నేను బాత్రుడనుగాను. రెండుమూడు గంటలనుండియు నా నీచస్వభావమునకు నాలో నేను నిందించుకొనుచుంటిని. కాని దానికి నేను బానిసను. అది నన్నుఁ బూర్తిగా జయించినది.

వీథి వెంట దొరలాడు హీనునికంటెఁ గన్నీటి ధారలకు నే నపాత్రుఁడను. మానటి! ఊఱడిల్లుము. నన్ను మఱచిపొమ్ము. నేను మాత్రము నా చిత్తమునందు నిరంతరము నిన్నారాధించు చుందును. నా తుదిప్రార్థన మొకటి. ఈ విషయమునమ్ముము"

"కార్టను! తప్పక నమ్మెదను."

"ఇది నా తుదిప్రార్థనము. ఇప్పుడు తెలుపుట నిరుపయోగ మని నే నెఱుఁగుదును. కాని నాయంతరాత్మ నన్నుఁ బ్రబోధించుచున్నది. అది యావేదనాసహితమై తరంగితమగుచున్నది. మానటీ! నీ కొఱకును నీయాత్మీయుల కొఱకును నా ప్రాణములనైనను బరిత్యజింతును. నీప్రశాంత సమయములందు నన్ను నీ మనసునం దుంచుకొనుము. నూతన బంధములు నిన్నావరించుకాల మరుదెంచును. అవి నిన్ను నీగృహకృత్యములతో గాఢముగా బంధించివేయును. మానటి! నీయందు నీప్రియుని ముఖప్రతిబింబము గోచరించునపుడు, నీ మనోహరాకృతి నీశిశుమూర్తియందు నూతనవికాసముతో నంకురించునపుడు, నీవు ప్రేమించు జీవికొఱకుఁ దన ప్రాణములను సమర్పించు మానవుఁ డొకఁడుండెనని యప్పుడపుడు తలంపుము. ఇది నా తుదిసంభాషణము. ఇంక సెలవు. దైవము నీకు మేలొనరించుఁగాక"

కార్టనచటనుండి వెడలిపోయెను.



## ఎనిమిదవ ప్రకరణము

పోలీసు భటులలోను సైనికవీరులందును డిఫార్జికిఁ బెక్కుమంది మిత్రులుగలరు. వారిలో నొకనిని సందర్శించి యతఁ డప్పుడే వచ్చెను. అతనిభార్య వానితో నిట్లనెను.

"పోలీసులందు జాక్వెసు నీతో నేమనెను."

"ఈ రాత్రి చాల కొలఁదియే. కాని వానికంతయుఁ దెలియును. మన ప్రాంతములను బరిశీలించుట కింకొక గూఢచారిని నియమించిరి."

డిఫార్జిసతి కనుబొమలను బైకెత్తి వాని వంక నరయుచు "మంచిది. అతని పేరుకూడ జాబితాయందుఁ జేర్పవలసి యున్నది. అతని పేరు?" అని యనెను.

"బార్సాడ్."

"బార్సాడ్. మంచిది. క్రైస్తవ నామము?"

"జాన్."

"జాన్ బార్సాడ్. అతనిరూపము తెలిసికొంటివా?"

"దాదాపు నలుబది సంవత్సరములుండును. అయిదడుగుల తొమ్మిదంగుళములయెత్తు. నల్లనిజుట్టు. నల్లనిశరీరచ్ఛాయ. నల్లని కనీనికలు. సన్ననిముఖము. పొడుగుగా నుండును. చిలుకముక్కు. కాని యది తిన్నగా నుండక యెడమచెక్కిలివైపునకు వింతగా వంగియుండును."

డిఫార్జిసతి నవ్వుచు

"ఆఁ దేశభక్తుఁడు! రేపు వానిని జాబితాలోఁ జేర్చెదను."

"నీ యల్లికయందు నెడతెగక పేర్లను జేర్చుచునే యుంటివి. అల్లిక యట్లే జరుగుచుండును. కాని మనమేమియు

నొనరింపము, చాల కాలమైనది" యని డిఫార్జి యనెను.

"చాలకాల మైనదా! ప్రతీకారమునకుఁ జాలకాలము పట్టును" అని డిఫార్జిసతి జబాబు చెప్పెను.

"పిడుగుతో మానవుని జంపుటకుఁ జాలకాలము పట్టదు. ఆ పిడుగును దయారు చేయుట కెంతకాలము పట్టును?" ఆమె వచనములందు సత్యము కలదని సూచించుచు డిఫార్జి తల నెత్తి చూచెను.

"భూకంప మొక నగరమును బొట్టపెట్టుకొనుట కెంత కాలమో పట్టదు. కాని దానిని దయారుచేయుట కెంతకాల మగునో చెప్పుము."

"చాలకాల మనుకొందును."

"అదిసంసిద్ధమైన వెంటనే తటస్థించును. అపుడు తన యెదుట నున్న సర్వమును దునాతునకలు గావించి నాశన మొన రించును. అంతకు లోపున నది సంసిద్ధమగుచుండును. దాని ప్రయత్నములను జూడ జాలము, వినఁజాలము."

ఆమె తన కుడిచేతిని జాచి మఱియు నిట్లనెను. "చాల కాలమైనను దారిలోఁ బడినది, వచ్చుచున్నది, రాకతప్పదు. మఱలుటగాని యాఁగుటకాని తటస్థింపదు. ముందున కరుగు చున్నది. నీ చుట్టును బరిశీలింపుము."

"ప్రపంచమున మన మెఱిఁగిన జీవులనుగూర్చి తలంపుము. వారి ముఖములను దలంపుము. నిశ్చయముతో ననుక్షణ మభి వృద్ధినొందు వారి క్రోధము నసంతృప్తిని యోచింపుము. అట్టి పరి స్థితులు నశింపగలవా?"

"ప్రేయసీ! నేను దీనినంతయుఁ బ్రశ్నించుటలేదు. కాని

బహుకాలము గతించినది, మనము జీవించియుండఁగా జరుగదని తలంచు చుంటిని."

"మనము చూడకపోయినను విజయము నిశ్చయము. మనము దానికి దారి చూపినవార మగుదుము. మనము చేయున దెన్నడు వ్యర్థము కాఁజాలదు. సమయ మరుదెంచును. అపుడు పులులను దయ్యములను విడిచిపెట్టుదము. కాని యాసమయము కొఱకు నిరీక్షించుచుఁ బిశాచవ్యాఘ్రముల నంతటివఱకు బంధించి యుంతుము. నీకుఁ జూపలేదు. కాని యెప్పుడైనను సిద్ధమే."

డిఫార్జి తన పనిమీఁద నరిగను.

మధ్యాహ్న మైనది. డిఫార్జిసతి కుట్టుపని నొనరించు కొనుచుఁ బానశాలయందు యథాస్థానమునఁ గూర్చుండెను. గల్లా పెట్టెమీఁద నొకగులాబిపూవు పడియుండెను. కొలదిమంది ఖాతాదారు లచ్చటచ్చటఁ గూర్చుండిరి.

ఒకవ్యక్తి లోనికిఁ బ్రవేశించెను. అతఁడు వినూతనుఁడని యామె వానిని జూచినంతనే గ్రహించుకొనెను. తన యల్లిక రుమాలును గ్రిందనుంచి రోజాపుష్పమును దలయందుఁ గ్రుచ్చు కొనెను. పిమ్మట నా వ్యక్తివంక మఱల నీక్షించెను.

డిఫార్జి తనతలయందు రోజాపుష్పము నలంకరించుకొను టకుఁ దీసిన వెంటనే యా ఖాతాదారులు సంభాషించుట మానివేసిరి. వారు పానశాలనుండి యొకరివెంట నింకొకరు వెడలిపోయిరి. అంత నా వ్యక్తి డిఫార్జిసతివంకఁ జూచి "యభి వాదము" అని యనెను.

"ప్రత్యభివాదము" అని యామె బిగ్గరగా ననెను. ఆమె

తన యల్లిక నారంభించెను. తనలో నిట్లు తలంచెను.

"ఆఁ నలుబదియేండ్ల ప్రాయము. దాదా పైదడుగుల తొమ్మిదంగుళములెత్తు, నల్లనిజుట్టు, నల్లనిరూపు, నల్లనికనీనికలు సన్ననిపొడుగు ముఖము, చిలుకముక్కు, కాని తిన్ననిదికాదు. ఎడమవైపునకు వింతగా వంగియుండును."

"దయచేసి చిన్నగ్లాసెడు ప్రాతబ్రాంది, యొక గుక్కెఁడు చల్లని నీరు నొసఁగుదురా?" యని యా వ్యక్తి డిఫార్జి సతి నడిగెను.

ఆమె సగౌరవముగా వానిని గొనివచ్చి యిచ్చెను.

"బ్రాంది యెంతరుచిగా నున్నది!" యని యావ్యక్తి నుడివెను. బ్రాంది సౌష్ఠవమును గూర్చి వినుతి గావింపఁబడుట కదియే ప్రథమము. డిఫార్జి సతికి దానివిషయము బాగుగాఁ దెలియును. ఆ నూతనపురుషుఁ డామె వ్రేళులను గొన్నిక్షణములు పరిశీలించెను. పానశాలను దేఱిచూచెను.

"మీరు నేర్పుగా నల్లుదురే!"

"నేను దాని కలవాటుపడితిని."

"అందమైన రకముకూడ."

"అట్లు తలంచుచుంటిరా?" యని యాతనివంక నవ్వుచుఁ జూచెను.

"నిశ్చయముగా. అది దేనికొఱకో నే నడుగవచ్చునా?"

"కాలయాపన" కని యాతనివంక నవ్వుచు మఱలఁ జూచెను.

"ఉపయోగమునకుఁ గాదా?"

"అవసరమునుబట్టి యుపయోగించుసమయము రావచ్చును."

వారిట్లు సంభాషించుచుండగా నొకరిద్దరా పానశాల లోని కొకరివెంట నొక రరుదెంచిరి. వా రామె తలయందున్న గులాబిపుష్పమునుజూచి యెవరో స్నేహితులకొఱ కచటఁజూచుటకు వచ్చినటుల నటించి వెడలిపోయిరి. ఈ యాగంతుకుఁ డరుదెంచినపు డచటనున్న వారిలో నొకరైనను మిగులలేదు. వారుకూడ నందరు వెడలిపోయిరి. ఆ వేఁగులవాఁడు తన కనులు తెఱచికొనియే యుండెను. కాని యాతఁ డెట్టిగుట్టును గ్రహించుకొనలేకపోయెను. వా రకారణముగా హఠాత్తుగా సర్వము సహజరీతిని వర్తించిరి.

"జాణ! కొంచెమాగు! నీపేరుకూడ నల్లద" నని డిఫార్జిసతి లోలోన దలఁచెను.

"వ్యాపారము చాల మందముగా నున్నదే" యని యాగంతుకుఁ డనెను.

"అవును. చాల మందముగా నున్నది. ప్రజలు బీదవారు."

"మీా రనినటుల దురదృష్టవంతులైన ప్రజలు మిగుల నొత్తిడిచేయఁబడుచుండిరి.''

"మీా రనినటు" లని యాతని తప్పు దిద్దుచు డిఫార్జిసతి యెత్తిపలికెను.

"క్షమింపుఁడు. మీారుకాదు. నేనేయంటిని. కాని మీారట్లు సహజముగా ననుకొందురు. అవును."

"నే ననుకొందునా!" యని యామె గట్టిగా ననెను. "నేనును నాభర్తయు నంగడి కనిపెట్టుకొని యుండుటకే కాలము సరిపోవుచున్నది. తలంపులకు నావకాశ మెక్కడిది? మా జీవితము లెట్లు నడచునా యని మాత్రమే తలంచుచుందుము.

అదియే మాయాలోచన. ప్రొద్దున మొదలు సాయంకాలము వఱకు దానినిగూర్చి యాలోచించుటతోడనే సరిపోవుచున్నది. ఇతరులజోలి యింకను మాకెందులకు?"

ఆ గూఢచారుఁడు తన కే యాచూకియు లభింప కుండు టచే నిరుత్సాహము నొందలేదు. తన మోచేతిని గల్లాపెట్టెపై మోపి చేరగిలఁబడి నిలుచుండెను. అప్పుడప్పుడు బ్రాందిని చవి చూచుచుండెను.

"ఎంత చెడ్డపని! గాస్పర్డు ఉరిదీయబడెను. పాపము!" అని జాలిగా నిట్టూర్పు విడిచెను.

"జనులు తమపనికిఁ గత్తి నుపయోగించినచో దానికిఁ దగిన ఫలిత మనుభవింతురు. దాని కేమి? దాని ఫలిత మతనికి ముందే తెలియును. దాని ననుభవించెను."

"అతని విషయమై యీ పరిసరములందలి జనులు జాలియుఁ గోపమును బడుచుండిరి."

"అట్లనా?"

"కాదా?"

"నాభర్త వచ్చుచుండెను."

పానశాలాధికారి లోనికిఁ బ్రవేశింపఁగానే గూఢచారి తన టోపీ నంటుకొని చిఱునగవుతో వందన మాచరించెను.

"జాక్విసు! అభివాదము."

డిఫార్జి కొంచె మాగి యతనివంకఁ దేఱిచూచెను.

"జాక్విసు, అభివందన"మని గూఢచారి మఱల నుడివెను.

"అయ్యో! మీరు పొరపడుచుంటిరి. నన్ను మీరింకొ కనిగాఁ దలంచుచున్నారు. నాపేరు డిఫార్జి" యని పానశాల

యజమాని నుడివెను.

"ఏదైన నొకటియే" యని యాగంతుకుఁడు నిర్లక్ష్య ముగాఁ బలికెను.

"సుదినము."

"సుదినము." డిఫార్జి సమాధానము చెప్పెను.

"మీరు వచ్చినప్పటికి మాటలసందర్భమున నీయాంటాని ప్రాంతములందు గాస్పర్డు నురిదీయుటను గుఱించి చాల విచార పడుచుండి రని పలుకుచుంటిని."

డిఫార్జి తలయూచుచు "నెనుసు నాతో నట్లనలేదు. నాకు దానిని గూర్చి తెలియ"దని సమాధానము చెప్పెను. అట్లు వచించి గల్లా వెనుకకుఁబోయెను.

ఆ గూఢచారుఁడు తన పనికి బాగుగా నలవాటుపడెను. తన పాత్రను వట్టిదిగాఁజేసి గ్రుక్కెఁడు మంచినీటిని ద్రావెను. ఇంకొక గ్లాసెడుబ్రాందితోలకు నర్థించెను.

"మీ కీ ప్రాంతములో నాకంటె నధికపరిచయము కలదని తలంతును."

"లేదు. బాగుగాఁదెలిసికొనవలయు నని తలంచుచుంటిని. ఇందలి దీనులగు జనులయందు నాకుఁ బ్రత్యేకాదరము కలదు."

'ఆ' యని డిఫార్జి గొణిగెను.

"నీతో మాట్లాడుటచే నీ పేరునకు సంబంధించిన కొన్ని విషయములు జ్ఞప్తికి వచ్చుచున్నవి."

"అవును, రావచ్చు" నని డిఫార్జి నిరాదరముగాఁ బలికెను.

"అవును! మానటి విడుదలచేయఁబడినపు డతని

పూర్వసేవకుఁడ వైన నీ రక్షణమునం దాతఁ డుండెను. నాకుఁ దెలియును. నీ కాయన నప్పగించిరి."

"సత్యము."

"నేను మానటిని, నాయన పుత్రికను నింగ్లాండునం దెఱుఁగుదును."

"అవును."

"నీవు వారినిగూర్చి తరువాత వింటివా?"

"లేదు."

"ఆమెకు వివాహము కానున్నది. ఆంగ్లేయునకుఁగాదు. ఆమెవలెఁ బుట్టుకచే ఫ్రెంచిదేశీయుఁడగు నొకనికి. గాస్పర్డునురికిఁ గారణమైన మార్క్విసు సోదరపుత్రుని బరిణయ మాడనున్నది. అనగా నిప్పటి మార్క్విసు. కాని యతఁ డింగ్లాండునం దెవరికి నెఱుఁగరాకుండ నివసించుచుండెను. అతఁ డచట మార్క్విసు గాఁడు. చార్లెసుడార్నే యను పేరుతో నుండెను. అతని జనని వంశనామము ననుసరించి యీపేరు మార్చఁబడెను."

డిఫార్జి సతి యల్లికముగించెను. ఆమె వివేకము భర్త మనము నాకర్షించెను. ఆమెయల్లినది మనసున గుర్తింప లేకుండినను జూడలేకపోయినను వాఁడు గూఢచారుఁడు కాజాలఁడు.

ఆ గూఢచారుఁడు వారితోడి సంభాషణవలన నెట్టిలాభము బొందినదియు నతనికే తెలియకపోయెను. తన గోష్ఠి నింకఁ గొంతకాలము జరుపుట కింకెవరును దోడుకాన్పింపలేదు. అతఁడు పానమున కయిన డబ్బును జెల్లించి వెడలిపోయెను. ఆ డిఫార్జిదంపతు లాతఁడు నిర్గమించిన యనంతరము కొంతసేపటి

వఱకు నట్లేయుండిరి. తిరిగిరాఁడని నిర్ధారణగావించుకొని డిఫార్జి తన భార్యతో నెమ్మదిగా నిట్లనెను.

"మానటికస్యనుగూర్చి యాతఁడు చెప్పినది నిజమై యుండునా?"

డిఫార్జి సతి తన కనుబొమలనెత్తి భర్తవంక నరయుచు "నతడు చెప్పినదికావున నబద్ధమై యుండవచ్చును. కాని నిజమైనను గావచ్చు" ననెను.

"అది సత్యమగుచో నతఁడు ఫ్రాన్సునకు రాకుండిన బాగుగ నుండును."

"ఆమె భర్తయదృష్ట మాతని నెచ్చటికిఁ గొనిపోవలయునో యచటికే గొనిపోవును. అది యాతని మృత్యువునకే గొనిపోవును."

"ఆమె జనకునియందును నామెయందును గల మన యాదరములో నామె భర్తనామము నీ గూఢచారునితోపాటు జాబితాయందుఁ జేర్చి నీ వల్లుచుండుట వింతగా నున్నది."

"ఇంతకంటె నాశ్చర్యమగు విషయము సంఘటించును. వారిరువురు నిచటఁ గలరు. ఇకఁజాలును."

ఆమె యల్లిక రుమాలును జుట్టివేసెను. వెంటనే తలనుండి గులాబిపూవును దీసెను. యథారీతి ఖాతాదారులు దుకాణములోనికి వచ్చిరి.

---

## తొమ్మిదవ ప్రకరణము

పారిసులోని సెయింటుఆంటోనిజిల్లా యంతయుఁ గ్రోధోద్దీపితులైన పురుషులతోడను, స్త్రీలతోడను నిండి యుండెను. వారి భయంకరకంఠనినాదములు మిన్నుముట్టు చుండెను. కత్తులయొక్కయు చిఱుకత్తుల యొక్కయు ధగధగ కాంతులు సూర్యకాంతులతో నైక్యమొందుచుండెను. తుపాకులు, కత్తులు, ఈటెలు, బల్లెములు, మందుగుండ్లు ప్రతివానికిని బంచిపెట్టఁబడెను. ప్రతివ్యక్తియుఁ బ్రతీకారము కొఱకుఁ గోపానలముచే మండిపడుచుండెను. అందులకుఁ దమప్రాణములను బరిత్యజించుటకైనను సంసిద్ధులైరి. ఈ భీకరమగు నల్లకల్లోలము నందు డిఫార్జి యగ్రయాయియై జనులకు మారణసాధనములను ననుజ్ఞల నొసంగుచుండెను.

"ఓ దేశభక్తులారా! మిత్రులారా! రండు, సంసిద్ధులు కండు. బాస్టయిలుకుఁ బయనింపు"డని హెచ్చరించెను.

భయావహంబగు నా కారాగృహదుర్గనామము నుచ్చైస్స్వరములతోఁ గేకలిడుచు నుద్రేకఘూర్ణితమగు ప్రజాసాగరము ముందునకు సాగెను. గంటలు మ్రోయించఁబడెను. వేలకొలది జనసముదాయము ప్రవాహములవలె పరిసరములందుండి యా ప్రజాసాగరమునందుఁ గలియుచుండిరి. ఉత్తరంగితఘోషారావములతో నా కోట యున్నత ప్రాకారములను జుట్టుముట్టిరి. గోడలు నేలమట్టము కావింపఁబడెను. గోపురములు కూల్చఁబడెను.

ఎడతెఱపిలేక యా జనసముదాయము రాక్షసులవలె ధైర్యసాహసములతోడను, గ్రోధావేశముతోడను బనిచేసిరి.

ఎక్కడజూచినను కేకలు పెడబొబ్బలు దిక్కులఁ బ్రతిధ్వనించెను. ఏమూలఁ జూచినను ధూమాన్వితములగు నగ్నిజ్వాలలు మిన్నుముట్టుచుండెను. శతఘ్నులు నోటులను దెఱచుకొని ప్రేలుచుండెను. మండుచున్న కొగడాలు, తగులఁబడుచున్న గడివాములు, ప్రధానద్వారము ముందు రేగుచుండెను. క్రోధముచే మేనెఱుంగని జనముల దీర్ఘకంఠరావములు శపథములు నిందాలాపములకు మితిలేకుండెను. ధనికప్రభువులు తమ కొనరించిన యకార్యాచరణములు తలంచుకొలఁది వారి హృదయములు దహించుకొనిపోవుచుండెను. ప్రతీకారముకొఱకు ప్రాణపరిత్యాగ మొనరించుటకైన వెనుదీయక ముందున కేఁగుచుండిరి. కడకు విజయము హస్తంగత మయ్యెను.

కోటయందుఁ దెల్లజెండా యెత్తఁబడెను. అది యస్త్రసన్యాసమునకుఁ జిహ్నము. బాస్టయిలుకోట స్వాధీనమయ్యెను. ప్రజాసాగరము భయంకరారావములతో దుర్గములోనికిఁ బ్రవేశించెను. వారి మధ్యయందు డిఫార్జి గాలిపీల్చుకొనుటకై వెనుదిరుగుటకైనను సావకాశము లేక ముందున కరుగుచుండెను. చివరకా సాగరము కారాగృహప్రాంగణమున కరుదెంచెను. ఆ భీకరరారావములమధ్య విజయగర్జారవములలో 'ఖైదీలు, ఖైదీ'లను మాట లందఱ నోటినుండియు వెలువడుచుండెను. వారందఱు కారాగృహాధికారుల నొక్కమ్మడిఁ జుట్టుముట్టిరి. బందిఖానాలను దెఱవకుండిన మీప్రాణముల నిట్టనిలువునఁ దీయుదుమని వారిని బెదరించిరి. వారు భీతిచే నన్నియుఁ దెఱచిరి.

డిఫార్జి కారాగృహాధికారులలో నొకనిఁ బట్టుకొనెను.

"ఉత్తర గోపురమును నాకుఁజూపుము. ఊఁ, త్వరగా" యని డిఫార్జి గద్దించుచు నడిగెను.

"చూపుదును. కాని యచట నెవరును లేరు"

"105 ఉత్తరగోపుర మనగా నర్థమేమి? బంధితుఁడా? బందిఖానా? లేక యేమిటి? త్వరగా."

"అది యొక చీఁకటికోణము."

"ఏది. నాకుఁజూపుము."

"ఇటు రండు."

డిఫార్జి యతనిమిత్రుఁడు జాక్వీసు మూఁడు, చేజేతులను గలుపుకొని యాతనివెంబడి నరిగిరి. దారి గాఢాంధకారము, ద్వారములు భయంకరములు, చీకటిగుహాలు,బోనులు, వానిపై సూర్యరశ్మి యేనాఁడును బ్రసరింపదు. వానిని దాటి యొక మెట్లమార్గమునఁ గ్రిందికి దిగిరి. అచటనుండి మఱలఁ బైకి మెట్లు కలవు. వానివెంబడి నరిగిరి. ఆ కారాగృహరక్షకుఁ డొక క్రింది పాటుగానున్న తలుపునొద్ద నాగెను. తాళములోఁ జెవినుంచెను. మెల్లగాఁ దలుపునుదెఱచెను. "ఇదియే 105 ఉత్తరగోపురము" అని నుడివెను. వారందరు తలలువాల్చి లోని కరిగిరి.

ఆ గుహాగ్రభాగమున నొకచిన్నకిటికి కలదు. దానికి ముందు రాతిజాలరు గలదు. వంగి తల నెత్తి చూచినగాని యాకాశము దానిగుండఁ గనఁబడ నేరదు. ఒక పొగగొట్టము కలదు. దాని లోతట్టున నినుపయూచ లడ్డముగా బిగింపఁబడియుండెను. దానియందొక యెత్తుపీటయు గడ్డిపఱపునుగలవు. ఆ గదినాలుగు గోడలు నల్లగానుండెను. వానిలో నొకచోటఁ దుప్పుపట్టిన యినుపచక్రము కలదు.

"ఆ కాగడాను గోడవెంబడి మెల్లగాఁ జూపుము. నేను జూడనలయు" నని డిఫార్జి యనెను.

ఆ మనుష్యుఁ డట్లే కావించెను. డిఫార్జి యా వెలుతురులో గోడలను బరిశీలించెను.

"ఆగు—జాక్విసు, ఇక్కడ చూడు."

"ఎ. యం." మూడవ జాక్విసు చదివెను.

ఫిరంగిమందుచే నల్లగానున్న గోడలమీది యా యక్షరములను వ్రేలితోఁ జూపుచు జాక్విసు చెవిలో "అలెగ్జాండరు మానటి"యని డిఫార్జి నుడివెను.

"ఇక్కడనాయన 'ఒక దురదృష్టవంతుఁడగు వైద్యుఁడు' అని వ్రాసెను. సందేహము లేదు. ఆయనయే. ఈ రాతిమీఁద నెవరు తారీఖులపట్టీని జెక్కినది? నీ చేతిలో నేమున్నది. పలుగా? ఇటు తెమ్ము."

చెదలుతిన్న యా బల్లను నెత్తుపీటను దానితోఁ బగులఁ గొట్టి తునాతునకలు కావించెను. అతడు కోపముతో "దీపము నింకను బైవైపున కెత్తుము. జాక్విసు! ఆముక్కలను జాగ్రత్తగాఁ బరిశీలింపుము. జాక్విసు, ఇదిగో కత్తి, ఆ పఱుపుకోసి తెఱువుము. అందలి గడ్డిలో వెదకుము. నీవు కాఁగడా పైకెత్తుము."

డిఫార్జి పొగగూటునఁకెగఁబ్రాకెను. పొగగొట్టములోనికిఁ దొంగిచూచెను. పలుగుతో దాని ప్రక్కవైపులను దట్టెను. దానినుండి యొకరాయియు కొంతదుమ్మును రాలెను. ఆ పొగ గొట్టమునంతయుఁ బరిశీలించెను. అందేమియుఁ గానరాలేదు. అచ్చటి కొయ్యలను గడ్డిని దగులఁబెట్టి మఱలఁ దనమిత్రులతోఁ గలసికొనెను.

బాస్టయిలు దుర్గమును సంరక్షించుచుండిన రక్షణాధికారి జనులమీదఁ దుపాకులు పేల్చినందులకు విచారణకై న్యాయశాల కీడ్చుకొని రాఁబడెను. వానిని డిఫార్జియు మిగిలినవారు నెత్తుకొని వచ్చిరి. ప్రజాసముదాయము క్రోధోద్రేకమున నొడలెఱుంగని వారయి వారి ప్రతీకారకాంక్ష యనివార్యమయ్యెను. వానిని మెట్లుమీదుగా లాగుకొని పోవుచుండ వెనుకనుండి ప్రజలు పట్టరాని కోపమున బడియలతో మోదిరి. అది వర్షపాతమువలె నాతనిపైఁ బడెను. ఆ ఘాతముల కాతని శరీరమంతయు రక్తమయ మయ్యెను. శిరము శతధా భిన్నమయ్యెను. అతఁడొక గోండ్రుపెట్టి ప్రాణములను విడచెను. డిఫార్జిసతి తన యెడమపాద మాతని మెడమీద మోపి కరవాలముతో శరీరమునుండి శిరమును వేఱుపఱిచెను.

---

## పదవ ప్రకరణము

బాస్టయిలు దుర్గము స్వాధీనమై వారము గడచినది. డిఫార్జి తన సారాదుకాణము లోనికి వచ్చెను. తన యెఱ్ఱని టోపీనిదీసి మిగుల నాయాసముతో నిట్లనెను.

"ఇచటి ప్రజలెల్లరు ఫౌలను నెరుగుదురా? అతఁడు తిండిలేక మలమలమాడుచున్న పేదజనుల గడ్డిఁదిని జీవింపుఁడని పరిహాసించెను. అతఁడు మరణించి నరకమున కరిగెనని తలంచితిమి. వానిని మీ రెఱుగుదురా?"

"ఆ, యెఱుగుదుము" అని యుచ్చైస్స్వరముతో నందరు

మాఱుపలికిరి.

"వాఁడు మనలోనే యున్నాఁడు"

"మనలోఁ జచ్చినాఁడా?" యని యందఱు కేకలిడిరి.

"చావలేదు. అతఁడు మనలకు మిక్కిలిభీతినొంది చని పోయె నను ప్రవాదమును బుట్టించెను. వానికి నుత్తరక్రియలు కూడఁ జేయఁబడెను. కాని వాఁడు బ్రతికియుండెనని కనిపెట్టఁబడెను. పరిసరగ్రామమునందు దాగియుండఁగాఁ గొనిరాఁబడెను. వానిని బంధించి న్యాయశాలకు గొనిపోవుచుండగాఁ జూచితిని."

ఒకక్షణ మంతయు నిశ్శబ్దముగా నుండెను. ఎల్లరివదనము లాశ్చర్యచకితము లయ్యెను. డిఫార్జిదంపతు లొండొరులను జేఱిచూచుకొనిరి.

"దేశభక్తులారా! సంసిద్ధముగా నుంటిరా?" యని డిఫార్జి యనెను. వెంటనే డిఫార్జిసతి చిఱుకత్తిని నడుమునందు గుప్త పఱచుకొనెను. వీధియందు భేరులు మ్రోగుచుండెను. 'వెంజన్సు' అను నతిభయంకరనారీపిశాచము పెడబొబ్బలిడుచుఁ జేతులను దలపైకెత్తి యాడించి మూర్తీభవించిన రౌద్రాధిదేవతవలె స్త్రీలను బ్రబోధించుచు నింటింటికిఁ బరువులెత్తుచుండెను.

పురుషులు రక్తాస్వాదనపరులయి కోపోద్రేకమునఁ దమ కందిన యాయుధములను జేత ధరించిరి. జనప్రవాహము తరంగములవలె సందుసందులనుండి యరుదెంచిరి. గృహకృత్యములను విడిచియుఁ జంటిపిల్లలనువీడియు నేలపైఁబఱచిన ప్రక్కలనుండి లేచియు నొండొరులను బ్రోత్సహించుచు భయంకరారావములతో స్త్రీలు సముద్రఘోషలతో వెడలివచ్చిరి. "నాసోదరిని భంగపఱచిన ఫౌలనా? నా తల్లి నవమానించిన ఫౌలనా? తిండి

లేని నిలువేదలను గడ్డితినుఁడని చెప్పిన ఫౌలనా? ముదుసలియగు నా తండ్రిని బోషింపఁ దిండిలేదనినప్పుడు గడ్డిని దినిపింపుమనిన ఫౌలనా? నా బిడ్డను గడ్డి కుడిపింపుమనిన ఫౌలనా! ఫౌలను రక్తము మా కొసఁగుడు. ఫౌలను శిరమును మా కొసఁగుడు. ఫౌలనుఁజిత్రవధగావింపుఁడు. భూమియందుఁబూడ్పింపుడు. వానిపై గడ్డిమొలుచును." అను కేకలతో న్యాయశాల వైపునకుఁ బ్రజా ప్రవాహము శరవేగమునఁ జొచ్చుకొనిపోయెను. సాయుధులైన స్త్రీ పురుషులెల్లరు నిసుక వేసినను రాలక న్యాయసభా ప్రాంగణమున మూగికొనిరి. పావుగంటలో సెయింటు ఆంటోనియందు శిశువులును గొలదిమంది వృద్ధులుతప్ప నెవరును లేరు.

దుర్మార్గుఁడగు ముదుసలి ఫౌలక న్యాయశాలకుఁ గొనిరాఁబడెను. ఆ భవనము పరిసరవీథులం దెల్లెడను క్రోధావిష్టులైన జనసముదాయములు క్రిక్కిరిసి గుంపులుగా నుండిరి. డిఫార్జిదంపతులు, వెన్జన్సు, మూఁడవజాక్వీసు న్యాయశాలలో దాపున నతని కెదుట నిలుచుండిరి.

డిఫార్జిసతి కత్తితో నాతనివంకఁ జూపుచు, "చూడండి చూడండి! ఫౌలనును త్రాళ్ళతో గట్టివేసిరి. అతనివీపుమీద గడ్డికట్టనుగూడఁ గట్టిన బాగుగనుండును. ఆ! ఆ! ఇప్పుడు బాగుగ నున్నది. దానిని దిననిండు." ఆమె తనకత్తిని జంకయందుంచుకొని యాటయందువలెఁ జప్పటులు చఱచెను.

డిఫార్జిసతి సంతోషకారణ మామె వెనుకనున్న జనులు వారివెనుకనున్న వారికిఁ దెల్పిరి. వారివెనుకనున్నవారికి మఱలవారు వారివెనుకవారికిఁ జెప్పుకొనుచు నానోట నానోటఁ బడి యావార్త జనులందరికిఁ దెలిసెను. వారందరుఁ బెనుగేక

లోనోఁ జప్పటులఁ జఱచుచుండిరి. ఆ ధ్వనులు మిన్ను ముట్టెను. అట్టి యీ విచారణకాలమునందు డిషార్జిసతి భావోద్రేకములు బాణవేగమున నెల్లరియందుఁ బ్రాకుచుండెను. కొందఱుజనులు కిటికీలలోని కెక్కి డిషార్జిని గనిపెట్టుచుండిరి. వారు జనులకు నామెకు మధ్య నతంత్రీవార్తాయంత్రములవలెఁ బనిచేయుచుండిరి.

కట్టకడకు ప్రేక్షకులసహనము తుదముట్ట నశించెను. వారింకఁ దాళలేక పోయిరి. ఘోలనుపైఁ గసితీర్చుకొనవలయునని యుద్రేకపడుచుండిరి. వెంటనే రక్షకులను దొలగించుకొని వారొక్కపెట్టున లోనికిఁ బ్రవేశించిరి. ఘోలక వారి దయాభిక్షమునకు గుఱియయ్యెను.

డిషార్జి కోరడికట్టలమీఁదుగాఁ దుమికిపోయి వానిని భయంకరముగా మడచిపట్టెను. డిషార్జిసతి యతనిని వెంబడించి పోయి యతని కట్టిన త్రాళ్ళలోనుండి చేతిని బోనిచ్చి పట్టుకొనెను. మూడవజాక్వెసు, వెంజన్ను అచటనే యుండిరి. జను లింకను లోనికి జొఱఁబడలేదు. పక్షిని మ్రింగుటకు డేగవలె నిరీక్షించుచుండిరి.

ఆ సదనపు మెట్లపై వానినిఁ దల క్రిందకుఁ బైకి నొకప్పుడు మోకాళ్ళమీఁదను, మఱొకప్పుడు పాదములమీఁదను, మఱొకప్పుడు వీపుమీఁదను బడునటుల నీడ్చుకొని పోవుచుండిరి. జనులు బడితెలతో మోద నారంభించిరి. గడ్డిచుట్టలను మీఁదఁబడవైచిరి. గాయములతోడను, జీలికలతోడను, రక్తధారలు ప్రవహించుచుండ నీడ్చుకొని పోవుచుండిరి. అతఁడు వారిదయాభిక్షమునకు బ్రార్థించుచుండెను. వారాతని నొక బజారుమలుపుదగ్గరకుఁ

గొనివచ్చిరి. అచ్చటనొక లాంతరుకలదు. అచటి డిఫార్జిసతివానిని విడిచిపెట్టెను. అతఁడు పిల్లి వలెఁబోవుచుండ నామె యాతనిని దీర్ఘముగా జూఁచుచుండెను. అంతయు సంసిద్ధమయ్యెను. స్త్రీపురుషులెల్లరు నాతనినోటిలో గడ్డినిపెట్టి చంపుఁడని కేకలువేయసాగిరి. అతనినోట గడ్డిని గ్రుక్కిరి. అటుపిమ్మటఁ జిత్రవధ కావించిరి.

---

## పదునొకండవ ప్రకరణము

శాస్త్రయిలు చుట్టుపట్టులందుఁ జెలరేగిన తుపాను నానాటి కభివృద్ధినొంది తీవ్రమగుచుండెను. మూఁడు సంవత్సరములా ఘాతుకకృత్యము లమానుషములై ప్రబలెను. రక్తప్రవాహములు నదీనదములను బురుడించి వీథులవెంబడి ప్రవహింపసాగెను. భూతప్రేతములు నాల్కలఁజూచి వికటాట్టహాసముతో రాత్రింబగళ్లు విహారమొనరించుచుండెను. మానవస్వభావము రాక్షసప్రకృతిని మించెను. వారిచెయ్దములకు వర్తనమునకు నోటికి నడ్డుపాటులేకుండెను. స్త్రీలు పురుషుల నతిక్రమించి పంతములను జెల్లించుకొనుచుండిరి. నగర మరాజక మయ్యెను. ప్రకృతిజనముల మారణసాధనమున కడ్డుపాటు లేకుండెను. జను లాహారములేక మలమల మాడిపోవుచుండ వర్సయిల్సునందు జక్రవర్తి తనసౌధాంతరాళమున షడ్రసోపేతమగు విందుభోజనముల సందడులయందుఁ గాలము గడుపుచుండెను.

క్రోధావేశపూరితులైన జనప్రవాహములు రాజసౌధమును జుట్టుముట్టిరి. లూయీ పారిసునకు రావలసివచ్చెను. క్రూరులగు ధనిక ప్రభువులు తమ ధనస్వామ్యముతో నింగ్లాండునకుఁ బ్రతి దినము వలసపోవుచుండిరి. రాజు సింహాసనమునుండి తొలఁగింప బడెను. ప్రభుత్వముగాని చట్టముకాని దేశమునందు లేదు. మధ్య రకమువారగు ప్రజాసామ్యవాదులమాటలు శాసనము లగు చుండెను. పేదలగు ప్రకృతిజనులయాజ్ఞలే చట్టము లయ్యెను.

బాస్టయిలు పతనమువలన ఫ్రాన్సునందతటను విప్లవములు చెలరేగెను. కృషీవలులు భూస్వాములను వధించిరి. పన్నులను వసూలుచేయు రాజకీయోద్యోగులు ప్రాణములను దొరఁగిరి. ధనికప్రభువుల నివాసము లగ్ని కాహుతులయ్యె. ఎవర్మాండి ప్రభువుభవనము భగ్నమయ్యెను. ఆయనతరఫున పన్ను వసూలుచేయు గాబలి ప్రాణముతో బైటఁబడెను.

ఫ్రాన్సునుండి వలసవచ్చిన ధనికులకు టెల్సన్సు బ్యాంకు కూడలిస్థల మయ్యెను. వారు వ్యాపారముల మాట లెట్లున్నను స్వదేశవార్తలను దెలుసుకొనుట కసంఖ్యాకులుగా నరుదెంచు చుండిరి.

1792 ఆగస్టు నెలయం దొకనాడు చార్లెసుడార్నే టెల్సన్సు బ్యాంకునకు వచ్చెను. పారిసునగరమునందలి టెల్సన్సు బ్యాంకుశాఖాసంరక్షణకు నరుగ సంసిద్ధుఁడైన లారీని వారింప వలయు నని యాయన యత్నించుచుండెను. కాని యది వ్యర్థ ప్రయత్నమయ్యెను. అట్టి సమయమునందు డార్నే పేరట నొక లేఖ వచ్చెను. దానిపైవిలాస మిట్లుండెను.

"జరూరు, శ్రీమంతులగు నెవరుమాండిప్రభువునకు!

కెల్సన్సు కంపెనీ బ్యాంకరులకు, లండను.”

మూఁడు సంవత్సరములకుఁ బూర్వము డార్నే ల్యూసీని వివాహమాడెను. అతనివాగ్దానము ననుసరించి డార్నే తన నిజనామమును వృత్తాంతమును మాసటి కెఱిగించెను. ఆ సంగతి యాయన కమితావేగము నొదవించెను. అందుమూలమున నాయన కొలదికాల మపస్మారకమునందు మునిగెను. ఆయన తేఱుకొని యతని యథార్థనామ మెవరికి నెఱిగింపకుండు మని డార్నేను బతిమాలెను. ఆ కారణమున డార్నే యెవర్ మాండిప్రభు వని లారీకిఁగూడఁ దెలియకుండెను.

కెల్సన్సు బ్యాంకు చుట్టుపట్టులఁ దిరుగాడుచుండిన జమిందారుల నందఱను బ్రశ్నించిరి. కాని యెవర్మాండినిగూర్చి యెవరు నే యాచూకియు నొసంగినవారు లేరైరి. మీఁదుమిక్కిలి ప్రతివారు నాతని నిందావాక్యము లాడఁదొడఁగిరి.

“చంపబడిన మార్క్విసు అన్నకుమారుఁడు, అతనిని నేనెన్నఁడుఁ జూచియుండలేదు” అని యొకరనిరి.

అతడు పిఱికివాయె కొన్ని సంవత్సరములకు ముందు రాజ్యము మీఁద హక్కులను వదలుకొని దేశమునుండి పాఱిపోయెనని యింకొకరనిరి.

క్రొత్తయధికారములవలని బాధ నొందకుండఁ జివర మార్క్విసునకు వ్యతిరేకముగా రాజ్యత్యాగ మొనరించి, దుర్మార్గుల హస్తంగత మొనరించెనని మఱియొక రనిరి.

అందరు నెవరి దారిని వారరిగిరి. డార్నే లారీతో నిట్లనెను. “మార్క్వి సెక్కడనున్నది నే నెఱుఁగుదును. ఆయుత్తరము

వాని కొసంగఁగలను" అని దానిని గైకొని యుత్తరమును దెఱచెను. అం దిట్టుల వ్రాయఁబడెను.

"అబయ కారాగారము"

పారిసు,

జూన్ 21, 1792

శ్రీమంతులగు భావిమార్క్విసు ప్రభువులకు: గ్రామవాసుల కరగతుఁడనై చాలకాలము ప్రాణభయమును బొందితిని. వారు నన్నుఁ గోపాతిశయమున బంధించి బహుదూరమందలి పారిసునగరమునకుఁ గాలినడకను గొనివచ్చిరి. మార్గమునందుఁ బడరాని పాటుల నెల్లఁబడితిని. అంతటితోఁ బరిసమాప్తి కాలేదు. నా గృహము నగ్నికాహుతి కావించిరి.

ప్రజాద్రోహపు నేరమును నాపై మోపిరి. నన్ను న్యాయసభకుఁ బిలిపింతురనియు, నన్ను విచారించి ప్రాణదండన విధింతురనియు ననుచుండిరి. నీసాయము లేక నేను రక్షింపఁబడజాలను. మీయానతి ననుసరించి ప్రజలకొఱకు నేను బాటుపడితిననియు వ్యతిరేకము నేమియు నొనరింపలేదనియు వాదించితిని. కాని, నిరుపయోగమయ్యెను. జమీనంతయుఁ బ్రజలు వశమొనరించు కొనుటకుఁ బూర్వమే పన్నులన్నియు ప్రభుత్వముపర మొనరించితిని. పిమ్మట నెట్టి యద్దెలు వసూలుగావింపలేదని బహువిధముల మొఱపెట్టుకొంటిని. కాని నా మొఱాలించు వారు లేరైరి. వలసపోయిన యొకనికొఱకుఁ బాటుపడితిననియు నావలసపోయినవాఁ డెచ్చటనుండెనో తెలుపుమనియు నన్ను బాధించుచుండిరి.

ఓ దయాస్వభావుఁడ వగు మార్క్విసు ప్రభూ! ఆ కాందిశీకుఁ డెచటనుండెనో? ఎచట నెచట నుండెనని నిద్రావస్థయందును

బలవరించుచుంటిని. దైవము నడుగుచుంటిని. అతడు నన్ను సంర క్షింపరాకుండునా? సమాధానము లేదు. ఈ సముద్రము మీఁదుగా నీచెవులయందు నా మొఱ పడునని బెల్సన్ను బ్యాంకు నకుఁ బంపుచుంటిని.

నీ వంశగౌరవము నామగౌరవము కొఱకు నిన్నుఁ బ్రార్థించుచుంటిని. నన్ను సంరక్షింపుము. నేను నీయందు విశ్వా సము కలిగియుండుట దోషమయ్యెను. నాయందుఁ గరుణాళుండ వగుము. నన్నుఁ గాపాడుటకుఁ జనుదెమ్ము.

ఇట్లు
నీ సేవకుఁడు
గా బ లి."

తన్నుఁ దనవంశీయులను వినయవిధేయతలతో సేవించిన గాబలి దుఃస్థితికి డార్నే పరితపించెను. గాబలి తన పూర్వ సేవకుఁడు. ల్యూసియందలి యనురాగపంజరమునఁ జిక్కికొని తన జమీనిగూర్చియుఁ దాను జేయఁదలంచుకొనిన విషయము లనుగూర్చియు డార్నే సర్వము మఱచిపోయెను. అది యాతనికిఁ దెలియును. కారాగారమున కరిగి యందలి తన జనులను బంధ విముక్తి గావింపవలయు నని యతఁడెఱుఁగును. కాని యతఁడట్లు గావింపలేదు. ఇప్పు డది యాలస్యమయ్యెను.

గాబలి యెవరిని బాధింపలేదు. ఎవరిని బందియందుంచ లేదు. ఎవరిని నిర్బంధించి పన్నులను వసూలుచేయలేదు. వారి యిష్టము ననుసరించి యొసఁగిన గ్రహించెను. అతడు తెక్కల కష్టముచేసి జీవితమును గడుపుకొనుచుండెను. ప్రాతమూల మునఁ బేదజనుల పక్ష మవలంబించి వారిని సంరక్షించెను.

వారి కీయఁదగిన దెల్ల నొసంగెను. చలికాలమునకుఁ గట్టి, యెండ కాలమునకుఁ గూడబెట్టిన పంట. గాబలి యీ సత్యమునంతయు తన క్షేమముకొఱకుఁ బ్రదర్శించెను. కాని యతని మంచి యంతయు వ్యర్థమయ్యెను.

ఈ చర్యలు డార్నే కానందకారణములయ్యెను. అతనిని సంరక్షింప నిశ్చయించుకొనెను. మొదలు తన వంశీయులు జనుల కొనరించిన యపకృతిని దలంచి పోవఁదలంచలేదు. కాని తన స్వకృత్యనిర్వహణయందు లారీ చూపుచున్న దృఢనిశ్చయతనుగాంచి మఱలఁ బోఁదలంచెను. (లారీ యఱువది సంవత్సరముల వాఁడయ్యును తన బ్యాంకువిషయములను ఖాతాదారుల సంగతులను సరిచూచుటకై పారిసునగమున కేగుచుండెను.) డార్నే తన కృత్యమునందెట్టి యాపద నూహింపలేదు. ఏలయన తన యభిప్రాయ ముత్తమమైనది. తనయాశయ మసంపూర్తిగా జరిగింపఁబడినను బ్రజాస్వామ్యవాదులుకూడఁ బ్రశంసింతురని తలంచెను. గాబలి బందియం దుండెను. అత డమాయకుడు. ప్రాణాపాయపరిస్థితియం దుండెను.

అతడు పారిసునకుఁ బోవఁ గృతనిశ్చయుఁ డయ్యెను.

---

# ఉత్తర గోపురము

## మూడవ భాగము

### మొదటి ప్రకరణము

కెలె పారిసుపట్టణములమధ్య దారు లల్లకల్లోలముగా నుండెను. నగరద్వారములు, గ్రామముల సుంకపుమెట్లుసాయుధ పాణులైన యుద్ధభటులచే నావరింపఁబడి యుండెను. వారు వచ్చి పోవు బాటసారుల నాపి దరియాబు చేయుచుండిరి. కాగితము లను బరిశీలించుచుండిరి. వారిపేర్ల జాబితాలను వెదకుకొను చుండిరి. కొందఱ నాపి తనుయధీనమునం దుంచుకొనుచుండిరి. ప్రజాప్రభుత్వాధికారనిబంధనల ననుసరించి యిష్టానురీతి వర్తించుచుండిరి. కావున డార్నేకుఁ బ్రయాణము మిక్కిలి కష్ట సాధ్య మగుచుండెను.

డార్నే కొలదిమైళ్లు ప్రయాణము సాగించెను. దేశ క్షేమమును గాంక్షించు నాగరకుఁడని పారిసుపట్టణమునఁ దేలు నంతవఱకు మఱలి చను దెంచుట కవకాశ ముండ నేరదని యతఁడు గ్రహించుకొనెను. ఏది యెట్లు తటస్థించినను దన ప్రయాణము తుది వఱకును సాగింపవలయును. సైనికులపరిశీలనము లంతకంత కాతనికి బాధాకరముగా నుండెను. చివరివఱకుఁ బ్రభుత్వము వారి సంరక్షణమునందుఁ బయనించినను, బోనునం దుంచి తీసి కొనిపోయిన నాతఁ డంతగా బాధపడెడివాఁడు కాదు, అతని స్వాతంత్ర్యము సంపూర్తిగాఁ బోయినదని తలంచెడివాఁడుకాదు, ఫ్రాన్సునందు దినములకొలది ప్రయాణ మొనరింపవలసి వచ్చెను. సంపూర్ణముగా నలసి సొలసి రేలు నిద్రింపవలసి వచ్చెను.

అతఁడు బాటప్రక్కనున్న యొక గ్రామమును జేరుకొనెను. అప్పటికి కింకను పారిసు చాల దూరమునం దుండెను.

అబయు కారాగారమునుండి గాబలి లిఖించిన యుత్తర మాతని నింతవఱకుఁ గొనివచ్చెను. ఆ గ్రామమునందలి సంరక్షణగృహములో నతనికిఁ దటస్థించిన కష్టములవలన నాతని ప్రయాణము విషమస్థితికి వచ్చెనని డార్నే యూహించెను. అర్ధరాత్రిసమయమున నెఱ్ఱటోపీలుగల ముగ్గురు సాయుధపాణులైన సైనికులు, గ్రామాధికారితోవచ్చి యాతనిని నిద్రనుండి లేపిరి. అతఁ డులికిపడి లేచెను. వారు డార్నేతో మీరు పారిసునకుఁ బ్రభుత్వపు సిబ్బందితో నరుగవలయునని నుడివిరి. డార్నే యాశ్చర్యచకితుఁడయ్యెను.

వారు ప్రయాణ మొనరించి బీవియసు నగరమున కరుదెంచిరి. అప్పటికి సాయంకాలమైనది. ఒక పూటకూటియింటి ముందు దిగిరి. అచట వీధులన్నియు జనసమూహముతో మూఁగి యుండెను. అనేకులు డార్నేను జూచుట కరుదెంచిరి. వారందఱు నేకగ్రీవముగా "నాగంతుకుఁడు నశించుగాక" యని కేకలిడుచుండిరి. అది డార్నేకు భయకంప మొదవించెను.

అంత డార్నే గుఱ్ఱమునుండి దిగుటమాని వారితో నిట్లనెను.

"ఆగంతుకుఁడు! మిత్రులారా! నాయిష్ట మనుసరించి ఫ్రాన్సునందు నేనుంట మీరు చూచుచుండుట లేదా?"

ఆ జనసమూహమునం దొకఁడు క్రోధరక్తాయమిత నయనములతోఁ జేతియందలి సుత్తిని పైకెత్తి, 'నీవు ద్రోహివగు నాగంతుకుఁడవు, దుర్మార్గుఁడ వగు రాజబంధుఁడవు' అని గద్దించి

పలికెను.

అంతలో నొక తపాలాధికారి వారిమధ్య కరుదెంచి, "కానిమ్ము, కానిమ్ము, పారిసునందు విచారింపఁబడు"న నెను.

"విచారణయా? దేశద్రోహిగా శిక్షింపఁ బడవలయు" నని చేతియందు సుత్తినూపుచు నాతఁడు జబాబుచెప్పెను. జనులంద ఱందులకు సమ్మతించిరి.

కొంచెము సావకాశమును గలిగించుకొని డార్నే వారితో "నయ్యా! నేను ద్రోహినిగా" నని యేదో వచింపఁ బోయెను. అంతలో నాయువకుఁ "డబద్ధమాడుచున్నాఁడు. వీఁడు తీర్పు నిర్ణయించఁబడిన నాటినుండియు ద్రోహి. అతని ప్రాణము లాతనివి కావు. జనుల కొప్పఁజెప్పవలయు"నని బిగ్గరగా న నెను.

జనసమూహము వైరభావము వహించెను. క్రోధపూరిత భావముతో నతనిపైఁబడ నుంకించెను. డార్నే యది గుర్తించి యనుచరులతోఁ ద్వరగాఁ బూటకూటియింటిలోని కరిగెను.

ఆ పూటకూటి యజమాని డార్నేను గలిసికొనెను. డార్నే వానితో "నామనుష్యుఁడు పలికిన తీర్పేమిటి" యని వానిని బ్రశ్నించెను.

"వలసపోయినవారి యాస్తినమ్మించుటకుఁ దీర్పు."

"ఎప్పుడు నిర్ణయింపఁబడినది?"

"పదునాల్గవ తేదీని."

" నే నింగ్లాండునుండి బయలుదేరినరోజు."

"పెక్కింటిలో నిది యొకటియని ప్రతివాడు ననుచుండెను. ఇంక నితరములు గలవు. వలసపోయినవారిని దేశమునుండి

వెడలఁగొట్టుట, తిరిగివచ్చిన వారికి మరణదండన విధించుట మొదలగునవి కలవు. నీప్రాణములు నీవి కావనుటలో వాని యభిప్రాయ మది."

"ఆ తీర్పు లింక నమలుపఱుప లేదుకదా?"

"నాకేమి తెలియును? జరిపినను జరుపకుండినను నొకటియే. నీకేమి వచ్చును?"

తుదకు వారు పారిసునకు వచ్చిరి. కోటతలుపులు మూయఁబడి యుండెను. చుట్టు సైనికులు కాపుండిరి. డార్నే యనుచరులతోఁ గోటను సమీపించెను.

ద్వారపాలకుఁడు లోనియధికారులకు వార్తనంపెను. వారిలో నొకఁడరుదెంచి "బందికి సంబంధించిన కాగితము లేవి?" యని సగర్వముగా నీక్షించుచుఁ బ్రశ్నించెను.

డార్నే కా మాటలు హృదయవేదనము కలిగించెను. వినయముతో నాయధికారివంకఁజూచి "యయ్యా! నేను బందిని గాను. స్వతంత్రుఁడను. ఫ్రాన్సు నాగరికుఁడను. కల్లోలితమైన రాజ్యమునందుఁ బయనింప సాయుధులైన యనుచరుల సంరక్షణ యవసరమైనది. నేను వారికి బత్తెము చెల్లించితిని."

అధికారి యాతనిమాటలను లక్ష్యముచేయలేదు. మఱల "నీబందికి సంబంధించిన కాగితము లేవి"యని ప్రశ్నించెను.

త్రాగి మత్తుగొనియున్న యా యనుచరుఁడు టోపీలో నుండి కాగితములను దీసి యిచ్చెను. అందు గాబలి వ్రాసిన యుత్తరము కలదు. దానిని బరిశీలించి యా యధికారి యాశ్చర్యచకితుఁ డయ్యెను. డార్నేను జాగ్రత్తగాఁ బరికించెను.

అతఁ డొకమాటయైనను బలుకలేదు. వెంటనే వారిని విడిచి రక్షణభటుల గదిలోని కేగెను. డార్నే యనుచరభటులతో ద్వారమువాకిట గుఱ్ఱము నధిష్ఠించి యుండెను. సందేహాందోళితమైన హృదయముతో డార్నే ముఖద్వారమువంక నరసెను. పౌరజనులు సైనికభటులుఁగలిసి కవాటములను బట్టుకొని యుండిరి. పౌరులసంఖ్య యతిశయించెను. వస్తుసామగ్రులతో నిండిన కర్షకుల శకటములు నిరాటంకముగా వచ్చుచుఁ బోవుచుండెను. కాని ప్రశాంతమానవులకు సైతము లోని కరుగ నసాధ్య మగుచుండెను. అధికసంఖ్యాకులగు స్త్రీలు, పురుషులు, జంతుజాలములు ప్రవేశమునకై ద్వారముకడ గుంపులుగూడి యుండిరి. ప్రధానపరీక్ష మిగులఁ గట్టుదిట్టములతోఁ గూడుకొని యుండెను. వారొక్కొక్కరుగా లోనఁ బ్రవేశించుచుండిరి. కొందఱు తమపరీక్షకు సావకాశముండుట తెలిసికొని నేలపైఁబడి నిద్రించుచుండిరి. కొందఱు పొగఁద్రాగుచుండిరి. కొందఱు పచారులు చేయుచుండిరి. కొందఱు కలిసి మాట్లాడుకొనుచుండిరి. వారందఱు నెఱ్ఱటోపీలను దలపైఁ దాల్చిరి.

డార్నే యచటి వింతల నరయుచు నరగంటకాల మట్లే గుఱ్ఱముపైఁ గూర్చుండెను. అంతలో నాయధికారి తిరిగివచ్చి తలుపులను దెఱువ నాజ్ఞాపించెను. అనుచరభటులకు నొక కారాగృహముచీటి నిచ్చెను. డార్నేను గుఱ్ఱమునుండి దిగుమని నుడివెను.

డార్నే యాయన ననుసరించి యొక రక్షకభటుల గదిలోని కరిగెను. ఆగదియంతయు ద్రాక్షారసము, పొగాకువాస

నలకో నిండియుండెను. కొందఱు సైనికులు నిద్రించు చుండిరి. కొందఱు మేలుకొని యుండిరి. కొందరు తప్పఁద్రావి మత్తెక్కియుండిరి. కొంద ఱోడలు తెలిసి మాటలాడు చుండిరి. కొందఱు కుర్చీలకానుకొని, నిలుచుండియుండిరి. కొన్నిపుస్తకములుబల్లమీఁదఁ దెఱువఁబడియుండెను. వానిముం దొక నల్లని మేని చాయఁగల యువకుఁడు కూర్చుండెను.

"డిఫార్జి! ఆగంతుకుడు, ఎవర్మాండి యితఁడేనా?" యని యా యధికారి యడిగెను.

"అవును, ఈతఁడే" యని యాతఁడు సమాధానము చెప్పెను.

"ఎవర్మాండి! నీప్రాయము?"

"ముప్పదియేడు."

"పెండ్లియైనదా?"

"ఆ."

"వివాహ మెక్కడైనది"

"ఇంగ్లాండులో."

"నీ భార్య యెచటనున్నది?"

"ఇంగ్లాండులో."

"ఎవర్మాండి! నీకు లాఫోర్సునందు కారాగృహశిక్ష విధింపఁబడినది."

"అయ్యో దైవమా! అయ్యో! నేను జేసిన నేర మేమి? ఏ నిబంధన ననుసరించి నాకు శిక్ష విధించితిరి?"

అధికారి డార్నే ముఖము నొకక్షణము తేఱిచూచెను.

"ఎవర్మాండి! మీ రిచటికి వచ్చినప్పటినుండియుఁ గ్రొత్త

నిబంధన లమలులోనికి వచ్చినవి. క్రొత్తయభియోగములు నియమింపఁబడుచున్నవి”యని సింహాగర్భితముగఁ జెఱునవ్వు చిలికించెను. మఱల యథారీతి వ్రాసికొనుచుండెను.

“తోడివాడైన స్వదేశీయుని వ్రాయసమునకు సమాధానముగా నాయిష్టానుసారము నేనిచ్చుటకు వచ్చితినని తమకు మనవి చేసికొనుచున్నాను. ఆ యుత్తరము మీ ముందుంచఁబడినది. అట్లరుదెంచుటకు నాకు హక్కు లేదా?”

“ఎవర్నాండి! ఆగంతుకులకు హక్కు లేదు” అని తీవ్రముగా నధికారి పలికెను. ఆయుద్యోగి తన వ్రాయసము పూర్తిగావించి యొకసారి లోలోనఁ జదువుకొనెను. దానిని డిఫార్జి కొసఁగెను. దానిమీఁద “రహస్యముగా”నని యుండెను.

డిఫార్జి యా కాగితములతో ఖైదీవద్ద కరిగెను. తన్ను వెంబడింపుమని శాసించెను ఖైదీ యతనిని వెంబడించెను. ఇరువురు సాయుధులైన సైనికులు వెంటనడిచిరి.

వారు రక్షణభటగృహమునుండి మెట్లు దిగి పారిసు నగరమున కరుగుచుండిరి. డిఫార్జి డార్నేతో మెల్లగా “బాస్టయిలు కారాగారమునం దుంచబడిన మానటి కుమార్తెను బరిణయ మాడినది నీవేనా?”యని ప్రశ్నించెను.

“అవు”నని డార్నే సమాధానము చెప్పెను.

ఆ ప్రశ్న డార్నే కాశ్చర్యము కలిగించెను. తలనెత్తి వానివంకఁ జూచెను.

“నాపేరు డిఫార్జి. సెయింటు ఆంటోనియందు నాకొక పానశాల కలదు. నన్ను మీరు వినియేయుందురు.”

“అవును. నాభార్య తనతండ్రిని గుర్తించుటకు మీయింటి

కరుదెంచెను."

"మీరు ఫ్రాన్సున కేల వచ్చితిరి?"

"ఒకక్షణము క్రిందనే చెప్పియుంటిని. నామాటలయందు మీకు నమ్మకము లేదా?"

డిఫార్జి బొమముడిపాటుతోఁ "గావచ్చు" ననెను.

"అయ్యో! నే నిచ్చటఁజిక్కుపడితిని. ఇక్కడ పరిస్థితులు మాఱిపోయినవి. విషమించుచున్నవి. దయయుంచి నాకొక చిన్నసహాయము చేయుదురా?"

డిఫార్జి డార్నే వంకఁ దీవ్రముగాఁ జూచుచు "నేమియుఁ జేయఁజాల"నని సమాధాన మొసఁగెను.

"నన్నన్యాయముగాఁ గొనిపోఁబడు కారాగృహమునం దుండి ప్రపంచముతోడ నే నుత్తరప్రత్యుత్తరములు జరుప వచ్చునా ?"

"నీవే తెలిసికొనఁగలవు ?"

"నా యభియోగము విచారింపకయే యందు నన్నుఁ బూడ్చిపెట్టుదురా ?"

"అదియుఁ జూడగలవు. ఇంతకుముం దనేకు లంతకంటె నధమములగు కారాగృహములందుఁ బూడ్చిపెట్టఁబడిరి ?"

"డిఫార్జి ! నే నెన్నడు నట్లొనరింపలేదు."

డిఫార్జి నిరుత్తరుఁ డయ్యెను. మాట్లాడక నడచి పోవుచుండెను.

వారు కొలదిసేపటిలో లాఫోర్సు కారాగృహమున కరుదెంచిరి. కారాగృహపాలకుఁడు వారిని వెంబడించెను. చీకఁటులు వ్యాపించిన మార్గములను దాటి మెట్లవరుసల నతిక్ర

మించి పెక్కు ద్వారములను గడచి వారొక క్రిందివాలున నున్న విశాలమగు సావడిలోనికి వచ్చిరి. అందు స్త్రీ పురుషు లగు ఖైదీ లనేకులు గలరు. అందు స్త్రీ లొక పొడుగు బల్ల ముందు గూర్చుండిరి. వారిలోఁ గొందరు చదువుకొనుచుండిరి. కొందఱు వ్రాసికొనుచుండిరి. మరికొందఱు దారముతో నల్లు కొనుచుండిరి. కొందఱు బట్టలు కుట్టుకొనుచుండిరి. కొందఱు పురుషులు కుర్చీల వెనుక నిలుచుండిరి. కొందఱు పచారులు చేయుచుఁ గాలమును గడపుచుండిరి.

బంధితులెల్లరు డార్నే చుట్టును జేరిరి. వారాతని గాంచిన వెంటనే లేచి ప్రీతిపూర్వకముగా స్వాగత మొసఁగిరి. ఆ చీఁకటి కోణమునందు సుందరసుకుమారమగు కుసుమువలె నాతఁడు గోచరించెను.

వారిలో నొక పెద్దమనుష్యుఁడు లేచి "దురదృష్టవశమున నిందుఁ గూడుకొనినవారిపక్షమున మీకు నేను స్వాగత మొసఁగు చుంటిని. మా మధ్యకుఁ గొనివచ్చిన మీ యభాగ్యతకు విచా రించుచుంటిని. మీ కచిరకాలముననే సుఖమగుగాక! మీ పేరు నడుగవచ్చునా?" యని యుపన్యాసపూర్వకముగా నుడివెను.

సందర్భమున కుచితములగు మాటలతో డార్నే వారికి సమాధానము చెప్పెను.

"మీరు రహస్యబంధమునం దుంచఁబడ లేదని తలంతును."

"ఆ పరిభాష కర్థము నాకుఁ దెలియదు. అట్లే యని చెప్పు కొనుచుండగా వినియుంటిని."

"పాపము! మీస్థితికి విచారపడుచుంటిమి. కాని ధైర్య మవలంబింపుఁడు. కొలదికాలములోనే యది తుదముట్టును.

రహస్యబంధమునం దున్నవారినిగూర్చివిషాదపడవలసియున్నది."

చార్లెసుడార్నే వారిని దాటి పోవుచుండెను. అచటి వారందఱు తమ విషాదమును వెలిబుచ్చిరి. వా రాతనికి ధైర్యము జెప్పిరి. డార్నే కారాగృహోద్యోగి వెంట నరిగెను. వా డాయన కొక యేకాంతగుహను జూపెను. డార్నే యందుఁ బ్రవేశించెను.

---

## రెండవ ప్రకరణము

పారిసులోని టెల్సన్సు బ్యాంకు విశాలమగు నొక భవనమునం దొకభాగమునఁ గలదు. దానిముందు విస్తీర్ణమగు దొడ్డి. దానిచుట్టు నున్నతమగు కుడ్యము. దానికి బలవత్తరమగు ద్వారము కలదు. అది యొక జమీందారుని గృహము. అం దాతఁడు చాలకాలము నివసించెను. దురదృష్టవశమున నాతఁడు కష్టములందుఁ జిక్కుకొని తన వంటవాని దుస్తులలో దేశమునుండి పాఱిపోయెను. ఆయన భవనమును బ్రభుత్వము స్వాధీన మొనరించుకొని, జనోపయోగార్థము వినియోగించుచుండిరి. కావున టెల్సన్సుబ్యాంకు ప్రత్యేకసంరక్షణసౌకర్యములు గలదయ్యెను. లారీ తన గదియందుఁ గూర్చుండి బ్యాంకుకు సంబంధించిన మిత్రుల కెట్టి యుపకారము తటస్థింప కుండినందులకు లోలోన నానందించుచుండెను. పట్టణమంతయు నల్లకల్లోలముగా నుండెను. రక్తపాతము నానాటి కభివృద్ధి యగుచుండెను. మృత్యుదేవత భయంకరవిస్తృతముఖగహ్వరముతో నాలుకలు వెలార్చుచు నట్టహాసముగాఁ దాండవించు

చుండెను. ప్రజాస్వామికమగు నూతనప్రభుత్వము పారిసు నగరమును స్వాధీన మొనరించుకొనెను. పోలీసుదళములు, కారాగృహములు, కోట వశపఱచుకొనెను. ధనికస్వామి కులను ధనికస్వామికపక్షపు జనుల నందఱను గారాగృహమునం దుంచిరి. న్యాయవిచారణకు వినూతన న్యాయమూర్తులను నియమించిరి. సెప్టెంబరు రెండవ తేదీన ప్రభుత్వసైన్య మధర్మముగా మోసమువలన నోడింపఁబడెను. నాటినుండియు సందేహితులైన ప్రజలను జిత్రవధ గావించుచుండిరి. ఖైదు లన్నియు నేరస్తులతో నింపఁబడెను.

ముఖద్వారమునొద్ద పిలుపుగంట వినిపించెను. లారీ యాలోచనల కాటంకము వాటిల్లెను. ఆ యావరణ యందలి సానరాతిపైఁ గత్తులను సానపట్టుకొనుటకు వచ్చిన దుండగీండ్రు గంటను మ్రోయించుచుండి రని లారీ మొదటఁదలచెను. కాని యాతని కెట్టి కల్లోలము వినిపించ లేదు. ఒక నిమిషము గడచినది. అంతలో ముఖద్వారము తెఱువఁబడెను. వెంటనే యిరువురు వ్యక్తులు లోనఁ బ్రవేశించిరి. ల్యూసీ, మానటి యామెతండ్రి.

"ఏమిటి? ఏమి తటస్థించినది? సంగతియేమి? మీరిచటి కేల వచ్చితిరి"యని లారీ వారిపైఁ బ్రశ్నలవర్షము కురిపించెను.

"నాభర్త పారిసునగరము నందుండె"నని ల్యూసి పెద్ద పెట్టున రోదన మొనరించుచు లారీ హస్తములందు వ్రాలెను.

"ఇక్కడనా? పారిసులోనా?"

"కొలదిరోజులక్రింద నిచట నుండెను. మూఁడునాల్గు రోజులు కావచ్చును. ఎప్పటినుండియో నాకుఁ దెలియదు. మాకుఁ దెలియకయే కబురు చేయగా వచ్చెను. కోటకడ నాపి

యాయనను గారాగృహమునం దుంచిరి."

ఆ ముదుసలి బిగ్గరగా రోదించెను. ఆ సమయముననే వారికి ముఖద్వారమునొద్దఁ బిలుపుగంట వినిపించెను. తోడనే పాదములచప్పుడును భయంకరమగు కంఠధ్వనులు వినిపించెను. జనులు ప్రవాహమువలె నావరణలోనికిఁ జొచ్చుకొని వచ్చుచుండిరి.

"ఆ ధ్వని యేమి?" యని మానటి కిటికి వైపునకుఁ దిరుగుచు ననెను.

"చూడకుము. బైటికిఁజూడకుఁ"డని లారీ బిగ్గరగా ననెను. మానటి వెనుకకుఁ దిరిగెను. లారీవంక నరయుచు "మిత్రమా! నగరపరిస్థితులు నాయం దుత్సాహమును గల్పించుచున్నవి. నేను బాస్టయిలు కారాగారమునం దుంటిని. నేను బంధితుడ నగుటచే నగరమునందలి దేశభక్తు లెవరు నా పైఁ జేయియైనను వేయఁజాలరు. వారు నన్నాలింగన మొనరించుకొని విజయోత్సవమును వెలిబుత్తురు. నేను పూర్వ మనుభవించిన బాధలు కోటలోఁ బ్రవేశించునపుడు నాకు నూతనచైతన్యమును గలిగించినవి. అందు మూలముననే చార్లెసును గుఱించిన విషయములను దెలిసికొనఁ గలిగితిని. ఆ చైతన్యమే నన్నిందుఁ గొని వచ్చినది. ఇది యిట్లగునని నాకుఁ దెలియును. ప్రమాదము నుండి చార్లెసును రక్షింపఁగల నని నాకు నమ్మకముగలదు."

మానటి మఱలఁ గిటికిలోనుండి బైటికిఁ జూచెను.

"చూడకుఁడు. వలదు. నీవుకూడను. భయపడకుము. చార్లెసునకు నెట్టి యపాయము రాఁజాలదు. నే నెఱుఁగుదును. అపాయప్రదేశమునం దుండెనని సందేహించుట కేనియు వీలు

లేదు. ఏ శైదునం దుండెను?"

"లా ఫోర్సు"

"లాఫోర్సునందా ? అమ్మాయీ లూ్యాసి! నీవెప్పుడైన నీ జీవితమునందు ధైర్యసాహసములు గలదాన వగుచో నేను జెప్పినటు లొనరింపఁదలంతువు. నీవు తప్పక యట్టిదానవే యగుదువు. ఆలోచనలవలని ప్రయోజనము లేదు. అవి కార్యరూపమును బొందవలయును. ఈ రేయి మనము చేయఁ గలిగిన దేదియు లేదు. బైటికిఁ బోఁజాలవు. చార్లెసు కొఱకు నీవు చేయవలసిన పని మిగుల కష్టసాధ్యమైనది. కావున నేనింత చెప్పవలసి వచ్చినది. నీవు నామాటయందు నమ్మకము గల్గి ప్రశాంతముగా నుండవలయును. నేను నన్ను వెనుక నున్న గదియం దుంచెదను. నన్నును నీ జనకుని గొంతసే పేకాంతముగా విడిచిపెట్టుము."

పిమ్మట లారీ యామెను వేగముగా వెనుకగదిలోనికిఁ గొనిపోయెను. మఱల వేగముగాఁ దిరిగివచ్చెను. కిటికీతలుపులను గటకటాలను దెఱచి మానటితోఁగలిసి బైటికిఁ జూచుచుండెను.

వారు స్త్రీపురుషుల గుంపులనుజూచిరి. దాదాపు నలుబది యేబదిమంది యుండవచ్చును. వారు సానరాతికడకుఁ జొచ్చి వచ్చిరి.

ఆ సానరాతికి రెండువైపులను బిడులుగలవు. ఇరువురు మనుష్యులు చెఱియొకవైపునఁ బట్టుకొని యుద్రేకముతోఁ ద్రిప్పుచుండిరి. వారిముఖములు భయంకరముగా నుండెను. వారిచర్యలు తీవ్రముగా నగుపించుచుండెను. అడవిజాతి

వారికంటెను గ్రూరులై శాసించుచుండిరి. ఆ సమూహమునం దెల్లవారి శరీరములయందు నెత్తురు చారికలు కట్టి యుండెను. వస్త్రములు నెత్తురుముద్దలు. ఆకారములు మహాభయంకరములు. వారొండొరుల భుజములను బట్టుకొని యొకరి వెంట నొకరు సానరాతిపైఁ దమయాయుధములను బదను పెట్టుకొనుటకుఁ ద్వరపడుచుండిరి. వారు ధరించినవి చింపిగుడ్డలు. వానిపై నెత్తురుచారికలు. ముఖములందు నెత్తురు లోడుచుండెను. వారి చర్యలనుగూర్చి లారీ మానటికి బోధించెను.

"వారు ఖైదీలను జిత్రవధ గావించుచుండిరి. నీవు నుడివిన మాటలయందు నీకునమ్మకము గలదేని,నీకుఁగలదనితలంచుకొను శక్తియందు నీకు దృఢవిశ్వాసము కలదేని యీ రాక్షసులతోఁ బరిచయ మొనరించుకొనుము. వారితోఁ గూడి లాఫోర్సు కారాగారమున కరుగుము. ఒక క్షణమైనను వ్యర్థ మొనరింపకుము."

మానటి లారీ కరమును బట్టుకొని స్పృశించెను. పిమ్మటఁ దలపై టోపీ ధరింపకయే గదిలోనుండి వెడలి పోయెను. ఆవరణయందుఁ బ్రవేశించెను. లారీ కటకటాలలో నుండి చూచుచుండెను.

మానటి నెఱసిన తలవెంట్రుకలు, వింతయగు ముఖలక్షణము, నాత్మవిశ్వాసము నాతనిని క్షణములో సానరాతి దాపునకు జేర్చెను. కొలదిసే పంతయు నిశ్శబ్దముగా నుండెను. మానటి యవ్యక్తకంఠస్వరము వారి హృదయముల నాకర్షించెను. అందఱు నాయనచుట్టు గుమికూడిరి. అందఱు నొక్కసారిగా "బాస్టయిలు కారాగారనివాసి చిరంజీవియగుఁగాక! లాఫోర్సులోని వాని బంధువునకు సహాయ మొనరింతురు

గాక! బాస్టయిలుకారాగారవాసికి ముందు ద్రోవయిండు! లాఘోర్సునందలి యెవర్మాండిని రక్షింపుఁ" డని కేకలు వేయుచు బైటి కరిగిరి.

లారీ కిటికీని మూసెను. ల్యూసియొద్దకు వేగముగా నరిగెను. ఆమె తండ్రి జనసహాయముతో నామె భర్తను వెదుక నరిగె నని వచించెను.

---

## మూడవ ప్రకరణము

మానటి వైద్యుఁడు నాల్గవ రో జుదయమువఱకు నింటికి రాలేదు. ఆ కాలమునందు జరిగిన ఘోరకృత్యములు ల్యూసీ కేమియుఁ దెలియవు.

కొంతకాలము గడిచిన తరువాత నామె తెలిసికొనఁగలిగెను. స్త్రీలు పురుషులు బాలబాలికలు పదునాఱువేల మంది పౌరుల కత్తులకు గొడ్డండ్లకు గుఱియైరి. కారాగృహాము లన్నియు ముట్టడింపఁబడెను. రాజకీయబందీలను గొందరిని బైటికి లాగి చిత్రవధ గావించిరి. ఆ నాల్గుదినము లతిఘోరముగా నుండెను. రక్తవాహినులు వీథులవెంటఁ బ్రవహించుచుండెను. ఆర్తనాదములు మిన్నుముట్టుచుండెను. పౌరుల భీషణఘోషణములు దిక్కుల నావరించెను. రాజకీయబందీ లందరు తమ ప్రాణము లఱచేతులందుఁ దాల్చియుండిరి.

పౌరజనసముదాయము మానటి వైద్యుని భయంకర మగు రక్తపాతముతో నిండిన దృశ్యములగుండ లాఘోర్సుకారాగృహామునకుఁ గొనిపోయెను. ఆ కారాగారమునం దొక

న్యాయాధికారి కూర్చుండెను. వాని ముందునకు నొక్కొక్క ఖైదీ తీసికొనిరాఁబడు చుండెను. అతఁడు వెంట వెంటనే కొందరికి మరణశిక్ష విధించుచుండెను. కొందరిని విడుదలచేయు చుండెను. మరికొందరిని మఱల ఖైదునకుఁ బంపివేయుచుండెను. మానటి నాతనియెదుటకుఁ గొనిపోయిరి. ఆయన తన నామ మును వృత్తియును వానికిఁ దెలిపెను. పదునెనిమిదిసంవత్సర ములు విచారణగాని దోషారోపణముగాని లేక బాస్టయిలు కారాగృహశిక్ష ననుభవించితి నని యాయనకు నెఱిగించు కొనెను. న్యాయము దిద్దుట కున్న న్యాయాధిపతులలో నొకడు లేచి యాయనను గుర్తించెను. అతఁడు డిఫార్జి.

డిఫార్జి బల్లమీఁద నున్న పుస్తకములను బరిశీలించి యాయన యల్లుఁడు బ్రతికియు ఖైదీలయందుఁగలడని స్థిరపఱచు కొనెను. అతని విడుదలకొఱకు ప్రధానన్యాయాధిపతితో గట్టిగా వాదించెను. గత ప్రభుత్వమునందు కడగండ్ల ననుభవించిన వాఁడగుటచే చార్లసుడార్నేను న్యాయమూర్తి యెదుటకుఁబిలిచి విచారణ గావించుటకు నేర్పాటు చేయఁబడెను. అతనిని విడు దలచేయుటకు సంసిద్ధముగా నుండిరి. సర్వము వాతావరణ మంతయు మానటికి ననుకూలముగా నుండెను. అంతలో నేమి జరి గెనో యెవరికిని దెలియదు. వారందఱుఁ గొంతసేపు రహస్య ముగాఁ గూడఁబలుకుకొనిరి. అంతటితో సర్వము నివారింపఁ బడెను. న్యాయసంఘాధ్యక్షుఁడు డార్నేను బందియందుంచ వలయుననియు, నాయనముఖముఁజూచి వానికేయాపద రాకుండ జాగ్రత్తగా నుంచఁబడుననియు నుడివెను. వెంటనే ఖైదీని లోపలి గదులకుఁ గొనిపోయిరి.

మానటి వైద్యుఁడు తనయల్లుఁడు నేరమొనరించుట వలన జనసముదాయమునకు వశముచేయఁబడి యుండ లేదని తేలునంతవఱకుఁ దన్ను చటనే యుంచవలసినదని వాదించెను. అందులకు వారు సమ్మతించిరి. అపాయము తొలఁగిపోవునంత వఱకు మానటి యారక్తశాలయం దుండెను.

ఆ కారాగృహమునందలి ఖైదీలకుఁ జికిత్సకుఁగా మానటి వైద్యుఁడు పనిచేయుచుండెను. వా రాయనను ప్రేమించుచుండిరి. ఎవరు నాతనిని సందేహించువారు లేరు. అతఁడు తన పలుకు బడిని దెలివిగా నుపయోగించుచుండెను. వేగముగా నాతనిని ముందు కారాగృహములకు వైద్యునిగా నియమించిరి. అందు లాఫోర్సు ఒకటి. కావునఁ బ్రతివారము కారాగృహమున కరుగును. అచట డార్నే పరిస్థితులను విచారించును. ల్యూసినుండి క్షేమ వర్తమానమును దెలుపులేఖలను దెచ్చుచుండును. డార్నే యొంటరిగా లేఁడనియు మిగిలిన ఖైదీలతోపాటుగ నుండెననియు ల్యూసీకి నభయ మొసఁగఁ గలిగెను.

చార్లెసుడార్నే యొక సంవత్సరము మూడుమాసములు కారాగృహమునం దుండెను. ఇంతకాలము మానటి యల్లుని విడుదలకొఱకుఁ బ్రయత్నించుట మాన లేదు. కాని జనప్రవాహ మతని కెదురుగాఁ బాఱుచుండెను. క్రొత్తశకము ప్రారంభ మయ్యెను. ఫ్రాన్సు ప్రజాస్వామిక మయ్యెను. స్వేచ్ఛ, సమానత్వము, సోదరభావము, లేదా, మరణము. రాజు ప్రజాద్రోహి యని విచారింపఁబడెను. దోషారోపణ మొనరించి యాతనిని వధ గావించిరి. ఒక విప్లవన్యాయాధికారిని నియమించిరి. అతీతమగు నధికారములతో నా కచేరి జాతికి దేశమునకు

వైరులైనవారిని విచారించి శిక్షించును. మానవరక్షణసంఘము, ప్రజాద్రోహులను వెంబడించి పట్టుకొని శిక్షించుట కొక సంఘము, అనుమానస్థులను బట్టుకొని శిక్షించుటకుఁ జట్టములు నిర్మింపఁబడెను. అతిభయంకరమగు పరిపాలనె ప్రారంభ మయ్యెను.

సంవత్సరము మూడుమాసములు ల్యూసీ యనుక్షణము సందేహాందోళితమానసయై పరివేదనము ననుభవించుచుండెను. ఎప్పు డామె భర్తశిరము ఖండింపఁబడునో యని యావేదనము నొందుచుండెను. అనుదినము వీథులవెంబడి బండ్లమీఁద నేర స్థులను వధ్యస్థానమునకుఁ గొనిపోవుచుండిరి. అందక త్తెలగు కన్యలు, తేజోవతులగు స్త్రీలు, యావనులు, ఆజానుబాహువు లగు పురుషులు, ముదుసలులు, ఉన్నతవంశీయులు, కర్ష కులు, అందఱు లాగాలటీనుకుఁ గొనిపోబడుచుండిరి. స్వాతం త్రము, సమత్వము, సోదరత్వము లేక-మరణము. గాలటీన్! చివరి దెంత తేలిక?

అప్పుడప్పుడు మధ్యాహ్నము మూడుగంటలకు డార్నే పై కిటికిలోనుండి వీథియందు ల్యూసీని జూచుచుండెను. అది యాతనికిఁ గొంతశాంతి నొదవించుచుండెను. కాని యామె యాతనిని జూడఁజాలదు. ల్యూసీ ప్రతిదినము నెట్టివాతావర ణమునందును రెండుగంటలనుండి నాల్గుగంటలవఱకు నాఖైదు ఖుందు నొక ప్రదేశమునఁ బచారుచేయుచుండును.

ఒక దిన మామె మధ్యాహ్నము తిరిగి వచ్చుచుండగా చార్లెసు విచారణకు మఱుసటిదినము కొనిరాఁబడునని మానటి తెలిపెను.

## నాలుగవ ప్రకరణము

న్యాయసంఘ మనుదినము నేరస్థులను విచారణచేయు చుండెను. అం దైదుగురు న్యాయాధికారులు నొక ప్రభుత్వ వాదియుఁ గలరు. వా రేదినమున కాదినము సాయంకాలము శిక్షితులజాబితాలను బంపుచుందురు. ఆ జాబితాలను గారా గృహపాలకుఁడు ఖైదీలకుఁ జదివి వినిపించును. డార్నే బంధింపఁ బడియున్న లాఫోర్సుకారాగారపాలకుఁడు యథారీతిని శిక్షి తుల నామములు ద్వారముకడఁ జదివి వినిపించుచుండెను. ప్రతి దిన మెవరో యొక రురికంబమునకుఁ బంపఁబడుచుండిరి. అతని తోడివారియందుఁ బ్రతి మానవుఁడు వధ్యస్థానమునకుఁ బంపఁ బడెను.

ఆనాఁ డొక గంటలోఁ బదునైదుగురు వధింపఁబడిరి. అనంతరము చార్లెస్ ఎవర్మాండి యను నామాంతరముగల డార్నే విచారణకై న్యాయసంఘమునకుఁ బిలిపింపఁబడెను. న్యాయాధికారు లీఁకలతో నలంకరింపఁబడిన టోపీలను దాల్చి తమస్థానములం దాసీనులైరి. ఇతరులు రక్తారుణములైన టోపీలను మువ్వన్నెకోటులను దాల్చియుండిరి. డార్నే న్యాయ సంఘమును సభ్యులను బరికించెను. పరిస్థితు లతనికిఁ దాఱు మాఱుగా నగుపించెను. న్యాయాన్యాయ విచక్షణ యెఱుగని మూర్ఖు లమాయికజనమును విచారించుచుండిరి. నీచకుల జులు, క్రూరులు, పౌరులయందు హీనులు నా దృశ్యములకుఁ బ్రేక్షకులుగా నుండిరి. వారి వ్యాఖ్యానములు, కేకలు, అసమ్మ తులు న్యాయభిక్షగా నుండెను. పురుషులలోఁ జాలమంది వివిధా యుధములను ధరించిరి. స్త్రీలలోఁ గొందఱు చాకులను, డాలు

లను, జిలుకత్తులను దాల్చిరి. కొందఱు త్రాగితందనాలు వేయు చుండిరి. చాలమంది యల్లికల నల్లుచుండిరి. చివర వారిలో నొకతె యొకయల్లికను జంకయం దుంచుకొని యుండెను. ఆమె ముందు వరుసలో నొకపురుషుని ప్రక్క నాసీన యయ్యెను. అతఁడు డిఫార్జియని డార్నే గ్రహించుకొనఁగలిగెను. ఆమె యాతనిచెవిలో నొకటి రెండుసారులు రహస్యముగా నేదో చెప్పుట డార్నే చూచెను. ఆమె యతని భార్య యని యూహించెను. వారు తనకుఁ జాల సమీపమున నాసీను లయ్యును నాతనివంక గన్నెత్తియైనను జూడకుండిరి. అది యాత నికి వింతగా గోచరించెను. వారు దేనికొఱకో స్థిరచిత్తముతో నెదురు చూచుచుండిరి. న్యాయసంఘముతప్ప నన్యములపై వారిచూపు ప్రసరించుటలేదు.

చార్లెస్ ఎవర్మాండి యాగంతుకుఁడని, ప్రజాద్రోహి యని ప్రభుత్వన్యాయవాది దోషారోపణ గావించెను. అతని ప్రాణము ప్రజాప్రభుత్వమునకు వశము కావింపవలయును. ప్రజాద్రోహులకు మరణశిక్ష పూర్వమే విధింపఁబడెను. అతఁడు ఫ్రాన్సునకు వచ్చిననాఁడే యాతీర్పు లములులోనికి వచ్చెను. కావున నతని శిరమును గోలుపోవలసి యుండెను.

"ప్రజారాజ్యములకు వైరి, వాని తల ఖండింపు"డని సభ్యులు కేకలు వేయసాగిరి.

సంఘాధ్యక్షుఁడు నిశ్శబ్దముగా నుండుఁడని గంట మ్రోయించెను. "నీవు బహుసంవత్సరములనుండి యింగ్లాండునం దుంటివికదా"యని నేరస్తునిఁ బ్రశ్నించెను.

"తప్పక యుండెను."

"అట్లయినచో నాగంతుకుఁడు కాఁడా? అత డెవరి నని యనును."

"ఆగంతుకుఁడు కాఁడు. నిబంధనలను బట్టియు భావమును బట్టియు నాగంతుకుఁడు కాఁడు. అతని యిష్టానుసారము వాని బిరుదులను విడిచిపెట్టెను. అతని కిష్టము లేకుండుటచే జమీా సైతము విడిచెను. దేశమును విడిచిపుచ్చెను. తన చెక్కుల కష్టముతో నింగ్లాండునందు నివసించుచుండెను. అప్పటి కాగంతు కుని కిప్పటి యర్థము లేదు."

"దాని కేమి దృష్టాంతము కలదు."

డార్నే యిరువురు సాక్షులను వారికొసఁగెను. అలెగ్జాం డరు మానటి, థియోఫెల్ గాబలి.

"కాని యాతఁడింగ్లాండునందుఁ బెండ్లియాడె"నని యధ్య క్షుడు జ్ఞాపకము చేసెను.

"నిజము కాని యాంగ్లేయయువతినిగాదు."

"ఫ్రెంచి నాగరకురాలా?"

"అవును. పుట్టుక చేత."

"ఆమె పేరు? వంశము?"

"ల్యూసిమానటి. మానటివైద్యునితనయ. ఉత్తమ చికిత్సకుఁడు. అదిగో యచటఁ గూర్చుండెను."

ఈ సమాధానము సభ్యుల హృదయపరివర్తనము గావించెను. మానటివైద్యునకు విజయధ్వానములు పభయం దంతటను మ్రోగిపోయెను. క్షణమునకు ముందు డార్నేను వీథిలోనికి లాగి చంపవలయు నని త్వరపడుచుఁ దీవ్రదృష్టితో నరయుచున్న జనుల యంతరంగములు కరిగి లోచనములనుండి

శాపములు జాలువారెను.

"నీవు వచ్చినదానికంటె ముందుగా ఫ్రాన్సున కేల రాలేదని" యధ్యక్షుడు డార్నేను బ్రశ్నించెను.

"అయ్యా! నాకు ఫ్రాన్సునందు నేను విసర్జించినయాస్తి తప్ప జీవితాధార మింకొకటి లేదు. ఇంగ్లాండునందు ఫ్రెంచి భాషాసారస్వతబోధకుఁడుగా జీవితమును వెళ్లబుచ్చుకొనుచుంటిని. ఫ్రాన్సుదేశీయుడు నేను రానిచోఁ దనప్రాణముల కాశ వదలుకొనవలసి యుండుననియు నన్నుఁ గాపాడవలసినదనియుఁ బ్రార్థనాపూర్వకముగా లేఖ నంపెను. నాకెట్టి యిక్కట్టు గలిగినను సత్యము నెఱిగించి యొక ఫ్రెంచి పౌరుని సంరక్షింప నరుదెంచితిని. అది ప్రజాప్రభుత్వదృష్టియందు నేరమా?" యని డార్నే వాదించెను.

'కాదు. కా'దని జనులు కేకలువేసిరి. ప్రశాంతముగా నుండుఁడని యధ్యక్షుఁడు గంటను మ్రోయించెను.

అధ్యక్షుఁ డా పౌరుని పే రేమని ప్రశ్నించెను. అతడు రెండవసాక్షి యని నేరస్థుఁ డెఱుకపఱచెను. అతఁడు వ్రాసిన యుత్తరమునుగూడఁ దెలిపెను. అది యధ్యక్షుని యెదుట నుండెను. ఆయుత్తరమును డార్నే యొద్దనుండి కోటముందు దీసికొనిరి.

ఆ యుత్తరము గొనిరాఁబడెను. దానిని జదివిరి. అందలి సత్యాసత్యములను స్థిరపఱచుటకు గాబలిని బిలిపించిరి. అతడరుదెంచి సత్యమును దెల్పెను.

తరువాత మానటి విచారింపఁబడెను. జనులం దతని పలుకుబడియు, గౌరవము, సమాధానముల ప్రసన్నత, హృదయ

మును రంజింపఁ జేసెను. చిరకాలము కారాగారమున నుండి విడుదలను బొందిన తరువాత డార్నే మొదటిమిత్రుఁ డయ్యె ననియు, నింగ్లాండునందు నేరస్థుఁడు నివసించుచుండె ననియుఁ బ్రవాసకాలమున నతనికిని నతనికుమార్తెకును మిగుల సహకారియు విశ్వాసపాత్రుఁడై యుండె ననియు, నింగ్లాండు ప్రభుత్వ మాతనిని దేశద్రోహిగా నమెరికామిత్రునిగాఁ బరిగణించి న్యాయస్థానమునందు విచారించెననియు, మానటి వచించెను.

అతని సాక్ష్యమును హృదయపూర్వకమగు దృఢనిశ్చయముతో నిచ్చుటచే న్యాయసంఘము, జనసమూహము, భావైక్యము కలవారయిరి. చివరకు నచటనేయున్న లారీ నామమును చెప్పి తన సత్యవాక్యతను నిర్ధారణ గావించు తఱి, న్యాయసభ్యు లధ్యక్షుని కిష్టమైనచోఁ దాము తమ వోటు నొసంగ సిద్ధముగా నుంటి మని నుడివిరి.

ప్రతివోటునకు జనులు తమ యానందమును దెలుపుచుఁ జప్పటులు చఱచిరి. అందఱి కంఠము లేకముగా నేరస్థుని కనుగుణముగా నీయఁబడెను. అధ్యక్షుఁడు వానిని విడుదల గావించెను.

---

## ఐదవ ప్రకరణము

డార్నే విడుదల కావింపఁబడిన సాయంకాలము మానటి సంసారము ప్యారిసునుండి త్వరగాఁ బ్రయాణమై యింగ్లాండున కరుగయత్నించుచుండెను. ప్రాన్ కన్య,ల్యూసిదాదియు, టెల్సన్సు బ్యాంకు ద్వారపాలకుడు జెర్రీక్రున్చరు (లారీకి సహాయకారిగా

వచ్చి ప్రస్తుతము మానటి సంసారపరిస్థితులయందుఁ దోడ్పడు చుండెను.) భోజనము, ద్రాక్షారసము మొదలగు నిత్యపాకము లను గొనితేఱ నంగడికరిగిరి. డార్నే, ల్యూసి, మానటీలు లారీ రాకకొఱకెదురుచూచుచుండిరి. అంతలో వారికి వింతయడు గుల చప్పుడువినిపించెను. తలుపు తట్టఁబడెను. వైద్యుఁడు తలుపు తెఱచెను. నలుగు రెజ్జిటోపీలవారు గదియందుఁ జొఱఁబడిరి.

"ఎవర్మాండి యను నామాంతరముగల డార్నే! నీవు ప్రజాప్రభుత్వపు ఖైదీవయితివి మఱల" నని మొదటివాఁడనెను.

"నే నేల ఖైదీనైతిని"యని డార్నే యడిగెను.

"తేపు నీకుఁ దెలియును."

"ఒకమాట. ఎవరు నేరముమోపిరో చెప్పుదురా" యని వైద్యుఁడడిగెను.

"అది నిబంధనలకు వ్యతిరేకము. డిఫార్జి దంపతులచే దోషా రోపణ చేయఁబడెను. మఱెవ్వరో?"

"ఎవరో యేమిటి?"

"మీరడుగుచుంటిరా?"

"అవును."

"మీకు తేపు తెలియును. నేనేమియుఁ జెప్ప"నని తీవ్ర ముగా మానటివంకఁ జూచుచు డార్నేను గొనిపోయెను.

---

## ఆఱవ ప్రకరణము

ప్రాసునకుఁగాని జెట్టికిగాని డార్నేకు సంభవించిన నూత నాపాయము తెలియదు. వారు సందుగొందు దారులవెంబడి

బజారున కరిగిరి. పలయు వస్తుసామగ్రులను సేకరించిరి. చివరి కొక ప్రశాంతమగు ద్రాక్షారసశాల కరిగిరి. అది మిగిలినదాని కంటె విశాలముగను బ్రశాంతముగా నుండెను. వారు ద్రాక్షా రసమును గొనుచుండఁగా నొకమూలనుండి యొక యువకుఁడు లేచి బైటికిఁ బోవనుండెను. అట్లు చనునప్పు డాతఁడు ప్రాసును ముఖాముఖి యెదురుపడుట తటస్థించెను. వెంటనే యామె యాశ్చర్యచకితయై యొక కేకవైచెను. కొంచెముసేపునకుఁ దెప్పి రిల్లి యనురాగసూచకముగా 'సాలమన్' అనియాతనిని బిలిచెను.

ఈ సాలమను ప్రాసుసోదరుఁడు. కాని యామె యతనిని గుర్తించుటయాతని కిష్టములేదు. కావున నామెను విదలించుకొని బైటికేగెను. కాని యామె యతనిని వెంబడించెను. సాలమ నామెతోఁ దానిపు డధికారోద్యోగిగా నుంటిననియు, నామె గుర్తించుటవలనఁ దనకుఁ బ్రాణాపాయము వాటిల్లుననియు, వివరించెను. జెట్టీ వానివెంట నరిగెను. ఆ విషయముల నాలకించెను. అతని నామాదులను గూర్చి ప్రశ్నించెను.

"ఆమె నిన్ను సాలమన్ అని సంబోధించెను. ఆమె నీసోదరి యగుటచే నిన్నెఱుఁగను. ఇంగ్లాండులో నిన్ను 'జాన్' అని యందురని నాకుఁ దెలియును. నీనామాంతరము ప్రాస్ అనుకొందునుగాదా? నాకు సరిగా జ్ఞాపకములేదు."

"బార్సాడ్" అని యొక యపరిచితకంఠము లోపల నుండి వచ్చెను.

ఆ పలికినది సిడ్నీకార్టను. అతఁడు వారిని సమీపించి తాను గడచిన సాయంకాలము ఫ్రాన్సునకు వచ్చితిననియు, వారి సంభాషణవలన నతడు ప్రాసుసోదరుఁడని గ్రహించితి

ననియును, నతడు బార్సాడుకంటె నన్యుఁడు కాఁడనియు, బెయిలీయం దింగ్లాండులో డార్నే విచారణ సమయమున దొంగ సాక్ష్యము సృజించెననియు, నానాటినుండియు సెయింటు ఆంటోని పరిసరములందు వేగులవానిగాఁ బ్రజాప్రభుత్వము వానిని నియమించెననియు; నిప్పుడు రాజకీయబందీలపై వేఁగుల వాడుగాఁ బనిచేయుచుండెననియు నుడివెను.

కార్టను బార్సాడును దనవెంట లారీ గృహమునకు రమ్మని బలవంతము చేసెను. కార్టనునకుఁ దన వృత్తాంతము తెలియును. తా నతని దిరస్కరించుట వలన లాభములేదని గ్రహించెను. మీఁదుమిక్కిలి ప్రాణాపాయము వాటిల్లును. కావున నతఁడు కార్టనును వెంబడించుటకు సమ్మతించెను.

మానటి వైద్యుని పలుకుబడి రెండవసారి డార్నేను సంరక్షించు ననుట కల్ల. డార్నే నెట్లైన సంరక్షింపఁ దలంపు గలదేని దానికిఁదగు ప్రయత్నము లొనరింపవలయును. కార్టను దానికిఁదగు పన్నాగము సంసిద్ధపఱచెను. డార్నే బందీకృతుఁడు కాకమునుపే దోషారోపణ, శిక్షావిధానము నిశ్చయింపఁబడెను. అన్యథా తప్పించుట యసాధ్యము. తన పన్నాగము బార్సాడు మీఁద నాధారపడి యుండెను. అతనియొద్ద డార్నే నుంచిన కారాగృహము తాళపుచేతులు గలవు. వాఁడా ఖైదునకుఁ దనిఖీయధికారి. కార్టను దలంచిన పన్నాగము లారీకైనను దెలుపలేదు. లూసీకిని, నామె తండ్రికిని, లారీ డార్నేలకుఁ బ్రయాణపు కాగితములను సంసిద్ధపఱుపుమనియు ననుజ్ఞాపత్రములను సంపాదింపుమనియుఁ బ్రోత్సహించెను. లారీ సర్వసన్నాహముతో సంసిద్ధుఁడై యుండెను.

డార్నే మిత్రుఁడగు కార్టనుకు సహాయ మొనరించి తనకుఁ బ్రాణాపాయము కలిగించుకొనుట బార్సాదున కిష్టము లేదు. కాని కార్టను వాని పూర్వగాథను ద్రవ్వి భయపెట్టెను. అతఁడు మాఱుపేరున వర్తించుచుండెను. ధనికస్వామికమైన ఇంగ్లాండునందు గూఢచారుఁడుగా నియమింపఁబడెను. ఇంగ్లాండు ఫ్రాన్సునకు విరోధి. అతఁడు ప్రజాప్రభుత్వమునకు వైరియని నిరూపింపఁబడిన లాగాలటీవలని శిరచ్ఛేదము తప్ప నింకొక శిక్ష లేదు. విచారణకుఁ దేఁబడినచో నింకఁగొన్ని యితర విషయములు బహిర్గతము లగును. ఆతనికి డిఫార్జి సతి యల్లిక జ్ఞప్తియందున్నది. ఆమె తీక్ష్ణముగా నతనివంక నరసిన సంగతి జ్ఞాపకమున్నది. ప్రస్తుతప్రజాప్రభుత్వమునకు వైరియగు ధనికస్వామికప్రభుత్వమునం దాతఁడు వేగులవాఁడుగా నియమింపఁబడెను. ఇతనితోపాటు క్లైనిగూడఁ గార్టను గుర్తించెను. అతఁడు బార్సాదు దుర్నయములందుఁ బాల్గొనెను. కార్టను వారిరువురకుఁ దమరహస్యములను నిగూఢముగా నుంతు నని వాగ్దానము గావించెను. అతనికి బార్సాదు సాయ మొనరింప మాట నిచ్చెను.

---

## ఏడవ ప్రకరణము

మఱునాడు చార్లెసుడార్నే న్యాయసభాసమక్షమునకుఁ గొనిరాఁబడెను. ఆ సభయందొక నియమముగాని, నిబంధన గాని లేదు. నేరస్థులు తమగోడు వినిపించుకొనుటకు సావకాశ మంతకంటె లేదు. డార్నే ధనికస్వామికవాది యనియుఁ, బ్రజా

స్వామికమునకు విరోధియనియుఁ గ్రూరవంశీయుఁ డనియు నాతనిమీఁద నభియోగము తేఁబడెను.

సభాధ్యక్షునకు సమాధానముగాఁ బ్రభుత్వన్యాయవాది యిట్లు వచించెను. పై నేరములు ముగ్గురిచే నిరూపింపఁబడెను.

"సెయింటు అంటోనీలోస ద్రాక్షరసవిక్రేత డిఫార్జి."

"అతనిభార్య డిఫార్జిసతి."

"వైద్యుఁడగు అలెగ్జాండరు మానటి."

సభాభవనమంతయు నుచ్చైర్నాదము లొనరించెను. వారిమధ్యఁ గంపితకాయుఁడై వికాసవిరహితముఖుఁడై మానటి తనస్థానమునందు నిలుచుండెను.

"అధ్యక్షా! మీమాటలను గోపించి తిరస్కరించుచుంటిని. మీ రన్యథమాడితిరి. నేరస్థుఁడు నా తనయకు భర్తయని మీకుఁ దెలియును. నా కుమార్తెయు నామెప్రియులును నాప్రాణము కంటె నాకుఁ బ్రియతములు."

"మానటి! శాంతింపుము. న్యాయాధికారులయెడ నవిధేతగా వర్తించుట న్యాయనిబంధనలను దిరస్కరించుట. నీకు బ్రాణాధిక మగునది ప్రజాప్రభుత్వమునందలి నాగరకుల కధికము కాఁజాలదు."

సభ్యులందుఁ గరతాళధ్వనులు చెలరేగెను. సకలము ప్రశాంతమయ్యెను.

"ప్రజాస్వామికము నీ తనయను ద్యాగమొనరింపుమని శాసించిన నామెను బరిత్యాగము చేయుటతప్ప యింకొక విధి లేదు. జరుగనున్నది వినుము. అంతవఱకు మాటాడకుము."

అందఱు మఱలఁ గరతాళధ్వను లొనరించిరి. మానటి

యాసీనుఁడయ్యెను. అతని చూపులు చలించెను. అధరము స్పందించెను. అతని తనయ యాయన సమీపమునకు జరిగి కూర్చుండెను.

సభాభవనము నిశ్శబ్దముగా నుండెను. డిఫార్జి సభాసమక్షమునకుఁ గొనిరాఁబడెను. అతఁడు మానటి బందీకృతుఁడైన కథయంతయు నుడివెను. వైద్యుని గృహమునందుఁ బని చేసిన సంగతి, బాస్టయిలునుండి విడుదల, తనకొప్పఁజెప్పిన విధము మొదలగునవి యన్నియుఁ దెలిపెను. తరువాత నాతనిని విచారించిరి. న్యాయసభ త్వరత్వరగాఁ దమ పనిని నిర్వర్తించెను.

"బాస్టయిలు ఖైదీని వశపఱచుకొనుటయందు మంచి పని చేసితివా?"

"నే నట్లే తలంతును."

అప్పుడు జనసముదాయము నుండి యుద్రేకపూరితమగు కంఠస్వరము బిగ్గరగా వినిపించెను.

"నీవు దేశభక్తులలో నుత్తముఁడవు. బాస్టయిలు దుర్గపతనమున లోనికి మొదటఁ బ్రవేశించితివి. దేశభక్తులారా! నేను సత్యము పలుకుచుంటిని."

ఆ పలికినది వెంజన్సు. అధ్యక్షుఁడు గంటను మ్రోయించెను. కాని యామె యుత్సాహముతో గంటను నిరాదరించుచుంటి ననెను. మఱలఁ గరతాళ్వనను లొనరింపఁ బ్రోత్సహించెను.

"బాస్టయిలు నందు నీ వే మొనరించితివో న్యాయసభకుఁ దెల్పు" మని యధ్యక్షుఁడు వచించెను.

"105 ఉత్తర గోపురమునం దీయన బంధింపఁబడెనని

నే నెఱుగుదును. ఆయన వలననే తెలిసికొంటిని. ఆయన నా సంరక్షణమునందుఁ జెప్పులను గుట్టునపుడు 105 ఉత్తర గోపురమని తన పేరు చెప్పుకొనుచుండెను. ఆ దుర్గపతనానంతర మా గుహాయందేమి కలదో తెలిసికొన నిశ్చయించుకొంటిని. నే నా చీఁకటికొట్టున కెక్కితిని. నాతోఁ బ్రస్తుతము న్యాయసంఘసభ్యుఁ డగు నొకమిత్రుఁ డరుదెంచెను. మా యిరువురకుఁ గారాగృహరక్షకుఁడు దారిచూపెను. నే నా కోణమును జాగ్రత్తగాఁ బరిశీలించితిని. కాని యందొక పొగగొట్టము కలదు. అందొక రాయి యూడఁదీసి మఱలఁ జేర్చియుండెను. అది తీయఁగా నా కొక కాగితము కనిపించెను. ఆ వ్రాతకాగిత మిది. మానటి వైద్యుని దస్తూరిఁ బరిశీలించితిని. ఇది యాతని చేతివ్రా లనుట నిశ్చయము."

"అది చదువు" డని యధ్యక్షుఁ డనెను.

ఆ నిశ్శబ్దముగా నున్న సభయందు డిఫార్జి యిట్లు చదివెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

"నేను దురదృష్టవంతుఁడ నగు వైద్యుఁడను. నా పేరు అలెగ్జాండరు మానటి. నా స్వగ్రామము బీవియన్ నగరము. తరువాత పారిసునగరవాసి నైతిని. నే నీ కాగితమును బాస్టియిలుదుర్గమునం దొకకోణమునం దుండి వ్రాయుచుంటిని. దీనిని దొంగతనముగా నప్పుడప్పుడు వ్రాసితిని. అట్టి సమయములందు నే ననేకకష్టములకు లోనయితిని. పొగగూడు గోడయందు దీనిని దాచ నెంచితిని. నేను గ్రమక్రమముగాఁ

గష్టపడి యొక తావు నొనరించితిని. నా హృదయమునుండి యాశ తొలఁగినది. కాని హృదయము దృఢనిశ్చయముగా నున్నదని నేను దెల్పుచుంటిని. నేను సత్యమును వ్రాయు చుంటిని.

నాటిరేయి గగనమునందు మేఘము లావరించెను. అది డిశంబరుమాసము. 1757 వ సంవత్సరమునందుఁ దుది దినము. నా నివాసమునుండి యొక గంట నడకదూరమునందున్న వైద్య శాలాల సమీపమునందున్న ప్రశాంతప్రదేశమున సెయిన్ నదీతీరమున వాహ్యాళి సలుపుచుంటిని. అప్పు డొక శకట మతివేగముగా నన్ను వెంబడించుచుండెను. నేను దానిని దప్పుకొనుటకుఁ బ్రక్కకుఁ దొలఁగితిని. ఆ శకటము కిటికిలో నుండి యొకఁడు తల బైటికిఁబెట్టి శకటచోదకుని "యాపు"మని శాసించెను.

శకట మాగెను. ఆ కంఠస్వరమే నన్నుఁ బేరునఁ బిలి చెను. నేను దానికి సమాధాన మిచ్చితిని. బండిముందుకేగి నిలఁబడితిని. నేను దానిని గలసికొను లోపున నిరువురు బండి తలుపును దెఱచి క్రిందికి దిగిరి. వారు శకటముదగ్గర నొకరి ప్రక్క నొకరు నిలుచుండిరి. వారిరువురకు నించుమించుగా నాప్రాయముండును. వారు రూపములందును, గవళికయందును, గంఠస్వరమునందును, ముఖమునం దొకరినొకరు పోలి యుండిరి.

"మీరు మానటి వైద్యులా" యని వారిలో నొకరు ప్రశ్నించిరి."

"అవును."

"మొదట బీవియస్ గ్రామవాసులగు మానటి వైద్యులు

మీ రేనా? కడచిన రెండు సంవత్సరములలో పారిసు నగరము నందుఁ గీర్తి గణించితి" రని రెండవవాఁడ నెను.

"అయ్యా! మీరంతగా గౌరవించు నా మానటివైద్యుఁడను నేనే"యని నేను సమాధాన మొసంగితిని.

"మేము మీ నివాసమున కరిగితిమి. మేము మి మ్మచ్చటఁ గాంచు నదృష్టమునకు నోఁచుకొనమైతిమి. ఈ వైపున మీరు వాహ్యాళికై యరిగిరని తెలిసికొని మిమ్ముఁ గలిసికొన వెంబడించితిమి. దయచేసి బండియం దెక్కుదురా?" యని మొదటివాఁ డనెను.

వారి విధానము లధికారకలితములు. ఆ మాటలతో వారు బయలుదేరిరి. నన్ను వారినడుమఁ గూర్చుండఁబెట్టు కొనఁజూచిరి. వారు సాయుధులు. నేను నిరాయుధుఁడను.

"అయ్యలారా! క్షమింపుఁడు. నా సాయము కోరువారి యాచూకి యడుగుట నాకు స్వభావము. నాతోఁబని యేమి? రోగ మెట్టిది?"

"వైద్యుఁడా! మీ ఖాతాదారులు ధనికకుటుంబీకులు. రోగమెటువంటి దందురు? అది నిరూపించుటకు మాకుం బెమీ రే తెలిసినవారు. మీరే నిర్ధారణ కావింపవలయును. మాకు మీయందు మిగుల నమ్మకము కలదు. రోగనిర్ణయముగావింపఁ గలరని మా తలంపు. చాలు, బండి నెక్కుదురా?"

నే నేమియు నొనరింపనేర నైతిని. వారి యాజ్ఞాబద్ధుఁడనై మాటాడక శకట మధిరోహించితిని. వా రిరువురు నా వెంట బండినెక్కిరి. బండి వెనుదిరిగి తొల్లిటివలెఁ దీవ్రవేగముతో నరుగుచుండెను.

ఆ శకటము వీథులను దాటి యుత్తరము వైపునంగల కోటకుడ్యమును వదలి గ్రామరథ్యవెంబడి నడుగుచుండెను. కోట కుడ్యమునకుఁ గొలఁదిమైళ్ళ దూరమునఁగల యొక యేకాంతగృహము నొద్ద బండియాగెను. మేము ముగ్గురము బండిని దిగి యొక పూలతోటయందలి దారి ననుసరించి పోయితిమి. అచట నొక గృహము కలదు. దాని ముఖద్వారమును సమీపించితిమి.. గంట మ్రోయింపఁబడెను. కాని వెంటనే తలుపు తెఱువఁబడలేదు. నన్నుఁగొనిపోయిన యిరువురిలో నొకరు తలుపు తెఱచిన వానిని ముఖముపైఁ జెప్పుతోఁ గొట్టెను.

ఆ కృత్యము నన్నుఁ బ్రత్యేకముగా నాకర్షింపలేదు. ఏల ననఁగా సామాన్యులు కుక్కలవలెఁ దఱచుగా నట్టిమర్యాద ననుభవించుట నేను బలుమాఱులు గాంచియుంటిని. వారిలో రెండవవాఁడు నటులనే కోపమును బొందియుండుటచే వానిని దన చేతితో మోదెను. అప్పుడు వారి పోలికలు కవలిక లొక్కటే తీరుగా నుండె నని కనిపెట్టితిని. వారు కవల లని తలంచితిని.

మేము ప్రహరిద్వారము చెంత బండిని దిగినప్పటి నుండియు మేడమీఁది గదియందుండి మాకు రోదనధ్వని విన వచ్చెను నే నాగదికిఁ దిన్నగాఁ దీసికొని పోఁబడితిని. మేము మేడమెట్లు నెక్కుచుండగా నేడ్పుధ్వని యంతకంతెను బిగ్గరగా వినవచ్చుచుండెను. లోనికరిగి యొకమంచముమీఁదఁ బడియున్న రోగిని గాంచితిని. ఆమె యేదో జ్వరముతో బాధపడుచుండెను.

ఆ రోగి యొకయౌవనవతి యగు యువతి. అతిసుందర

స్వరూపురాలు. ఇఱువదియేండ్లుండును. ఆమె శిరోజములు తెగి చిక్కువడియుండెను. చేతులు ప్రక్కకు విఱచి చేతిరుమాళ్ళతోను గుడ్డపీలిలకతోను గట్టఁబడెను. అవియన్నియుఁ బురుషుని దుస్తులభాగము లని నేను గ్రహింపఁగలిగితిని. వానిలో నొక దానిమీఁద నొక జమీందారుని చిహ్నమును 'ఇ' యను నక్షరము కలదు.

నేనామె నొక ప్రక్కనుండి యింకొక ప్రక్కకుఁ ద్రిప్పితిని. నాచేతి నామెను శాంతపఱచుటకు నుద్రేకము తగ్గించుటకు వక్షమున నుంచితిని. ఆమెముఖమును బరిశీలించితిని. ఆమెకన్నులు సుతీక్ష్ణములై యుండెను. ఆమె తఱచుగా హృదయవిదారకముగా నఱచుచుండెను. 'నా భర్త' 'నాతండ్రి' 'నాసోదరు'డని పలుమాఱు నుడువుచుండెను. పిమ్మటఁ బదునొకండువఱకు లెక్కించి 'హుష్' అనుచుండును. ఒకక్షణము వినును. మఱలఁ దీవ్రముగా నఱచును. మఱల నాభర్త-నాతండ్రి - నాసోదరుడని యేడ్చును. పదునొకండువఱకు లెక్కించును. 'హుష్' అనును. ఆ విధానమునందుఁగాని క్రమమునందుఁగాని మార్పులేదు. ఉచ్చరించుటలో నాపుదలయందు సైతము నించుమించులులేవు.

"ఇది యెంతసేపటినుండి?" అని నేనడిగితిని.

"క్రిందటిరాత్రి యీ గంటనుండి" యను సమాధానము.

"12 అంకెతో నామె కేదో నూతనముగా సంబంధ ముండి తీరవలయు" నని నేనంటిని.

"మీరే చూడండి"యని నిరాదరముగా ననుచు దీపమును దీసికొనెను.

"రెండవసోపానశ్రేణి కడ్డముగా నింకొక రోగి వెనుక

గదియందుఁ బడియుండెను."

నేలపైఁ బఱచఁబడిన గడ్డిమీఁద దిండు తలక్రింద నుంచుకొని యొక సుందరుఁడగు బాలుఁడు పడియుండెను. అతనికిఁ బదునేడేం డ్లుండును. అతడు వెల్లకిలఁగా బడియుండెను. పండ్లు కఱచుకొని పోయెను. కుడిచేయి వక్షమును బట్టుకొనియుండెను. అతనిచూపు మీఁదునైపునకుఁగలదు. పదునగు మొనవలని గాయముచే నాతఁడు చాపునకు సిద్ధముగా నుండెను.

"నేను వైద్యుఁడను. సన్నుఁ జూడని"మ్మని నేనంటిని. మీారు చూడ నవసరములేదు. ఉండనిం"డని యతఁడు సమాధాన మిచ్చెను.

ఆ గాయము భుజముక్రిందఁ గలదు. అతని నూరడించి చేతిని గదలింపనిమ్మనియంటిని. ఇరువదినాలుగు గంటలముందా గాయము క త్తివలనఁ గలిగినది. ఆలస్యముచేయక నేర్పుతోఁ జికిత్స గావించినను నతనిని సంరక్షించుట యసాధ్యము. అతడు మరణావస్థయం దుండెను. నే నా యిరువురిలోఁ బెద్ద వాని వంకఁ జూచితిని. అతఁడు గాయపడిన పక్షినో, కుందేటినో చూచినట్లు, ప్రాణములు నిర్గతము లగుచున్న యా బాలుని చేతి గాయమువంకఁ జూచుచుండెను.

"అయ్యో! యిది దేనివలనఁ దటస్థించె"నని నేనంటిని.

"పిచ్చి యూరకుక్క! నా యన్నను గ త్తిదూయుటకు బలవంత మొనరించెను. మర్యాదస్థునివలె నాతని క త్తిచేఁగూలెను."

అతని సమాధానమునందు దయాదాక్షిణ్యములు లవలేశమైనను గోచరించలేదు.

అతఁడు మాటాడుచుండ నా బాలుని కనులు వానివైపు

నను మెల్లగా మఱలెను. మఱల మెల్లగా నావంకకు మఱలెను.

"వైద్యుఁడా! ఈ జమీందారులు మిగుల గర్విష్ఠులు. మన మూరకుక్కలము. ఒకొక్కప్పుడు మనముకూడ గర్విష్ఠుల మగుచుందుము. వారు మనలను దోచుకొందురు. కోపింతురు, కొట్టుదురు, చంపుదురు. కాని మన కొకప్పుడు కొలఁది గర్వము మిగిలియుండును. అయ్యో! మీ రామెను జూచితిరా?"

"చూచితి" నని నేనంటిని.

"డాక్టరుగారు! ఆమె నా సోదరి. ఆమె యుత్తమురాలు. ఆమె యొక యుత్తమయువకునకుఁ బరిణయము గావింపఁ బడెను. అతఁ డీయన కౌలుదారుఁడు. మేమందరము నా నిలుచున్న యాతని కౌలుదారులము. రెండవవాఁ డాయన సోదరుఁడు. దుర్మార్గులలో దుర్మార్గుఁడు."

ఆ బాలుఁడు మాటలాడుట కతికష్టముగా శరీర బలమును గూర్చుకొనెను. ఆ నిలుచుండిన మానవుఁడు మా సర్వస్వము కొల్లగొనెను. మే మూరకుక్కలము. వారు దేవాంశులు. కరుణలేక పన్నులను విధించును. కూలి లేక మేము పనిచేయవలయును. అతని మఱమొద్దనే మా ధాన్యము పిండి పట్టించవలయును. మా చేలమీద నాతని వేలకొలఁది పక్షులు జీవింపవలయును. మే మొక మచ్చిక జీవినైన నుంచుకొనుటకు వీలులేదు. ఒక్క మాంసపుముక్క యున్నను భయము వలన దొంగతనముగా భుజింపవలయును. దాని నాతని జనులు దొంగిలించుకొని పోకుండుటకుఁ దలుపులు కిటికీలు మూసికొనవలయును. మా సర్వస్వము దోచుకొని పోవుచుండును. మేము నిరుపేదలుగా నొనరింపఁ బడితిమి. ఒక బిడ్డను

ప్రపంచమునందుఁ ప్రబలించుట యతి భయంకరమగు విషయ మనియు, మా స్త్రీలు గొడ్రాండ్రు కావలయుననియు, మా జాతి మొదలంట నశింపవలయుననియు, నేము దైవమును బ్రార్థించు చుండవలయునని మా తండ్రి చెప్పుచుండును."

"అయ్యో! నాసోదరికిఁ బరిణయమయ్యెను. ఆమె ప్రేమించినవానిని యామె పెండ్లాడెను. మాకుటీరమునందే వారు నివసించియుండిరి. పెండ్లయి పెక్కువారములు కాలేదు. ఆ మనుజునిసోదరుఁ డామె సరసి యామె యందచందములకు నాశ్చర్యపడెను. ఆమెను దనకిమ్మని యామెభర్త నడిగెను. మాలో భర్తలెవరు? అతఁ డిష్టపడెను. కాని నా సోదరి గుణవంతురాలు. నావలెనే యామె యతనిసోదరు నసహ్యించుకొనెను. వారప్పు డేమొనరించిరి? ఆమె భర్తను దనపలుకుబడి శక్తి నుపయోగింపుమని బలవంత పెట్టిరి."

ఇంతవఱకు నాపై నెలకొనిన యాతని చూపు లామనుజునివంకకు మఱలెను. ఆయిరువురి ముఖములం దాతఁడు చెప్పిన వార్త సత్యమని నాకు గోచరించెను. వారి గర్వసహితములైన దృక్కులు నాకీ బొస్టయిలునం దిప్పటికిని గోచరించుచున్నవి. ఆ జమీందారుని నిరాదరణభావము, కర్షకబాలుని పదాహతమైన యూహా ప్రతీకారదీక్ష కన్నులకుఁ గట్టినటు లున్నవి.

"వైద్యశిఖామణీ! ఊరకుక్కలమగు మమ్ము బండికిఁ గట్టికొలుట జమీందారుల హక్కులలో నొకటి. కావున వానిని బండికి గట్టి తోలిరి. వారి గాఢనిద్రకు భంగము కలుగకుండునటులఁ గప్పలను నిశ్శబ్దము గావించుటకు మమ్ములను రేయెల్ల నావరణయందుఁ గాపుంచుట వారి హక్కు-

లలో నింకొకటి. రాత్రులయం దాతనిని మంచులో నారు బైట నుంచిరి. పగలు బండిలాగుటకు నాజ్ఞాపించిరి. ఒక్కొక్క నాడు మధ్యాహ్నము తిండికై విడుతురు. అది లభించుట దుర్లభము. అతఁడు ప్రతిఘంటారవమున కొకొక్కసారి గా పండ్రెండు సారులు విలపించెను. ఆమె వక్షమునం దాయూవేదన సళించు చుండెను."

"ఆ మానవుని యనుమతితో నతని సహాయముతో నితని సోదరుఁ డామెను గైకొనిపోయెను. క్షణకాలసుఖము నపేక్షించి యతని సోదరుఁ డామెను గొనిపోయెను. నే నామెను కొట మీద నాప్రక్క నే పోవుచుండగాఁ జూచితిని. నే నీ విషయమును నా జనకునితో వచించితిని. అతనిహృదయము విదారితమయ్యెను. నా కింకొక సహోదరికలదు. నేనామె నీమానవుని యంపుబాటు నకు దూరముగాఁ గొనిపోతిని. అచట నామె యీతని యధి కారమునం దుండదు. పిమ్మట నీతని సహోదరుని వెంబడించి రాత్రిసమయమునం దీ మేడ నెక్కి లోని కరుదెంచితిని. ఒక యూరపుకక్కనుగాని కత్తి చేతియందున్నది."

"నేనునాచుట్టుపట్టులం దరసితిని.అంతటను బచ్చిక, వరిగడ్డి నేలమీంద చెదరిపడియుండెను. దానివలనఁ గొంత పోట్లాట జరిగ నని గ్రహించుకొంటిని."

"ఆమె నాయలికిడి నాలించి లోనికిఁ బరుగెత్తుకొని వచ్చెను. అతఁడు చచ్చునంతవరకు నాదాపునకు రావలదని యామెతో నంటిని. అతడు నాదగ్గరకువచ్చి కొన్ని బంగారు నాణెములను నాకు విసరివేసెను. పిమ్మట నొక కొరడాతోఁ గొట్టెను. నే నూరకుక్కనయ్యును నతఁడు కత్తిదూయునంత

తీవ్రముగా నాతనిని నా కరవాలముతో గాయపఱచితిని. అత డాత్మసంరక్షణకై కత్తిసిదీసెను. అతనిప్రాణములకొఱకు నాపై నాతని కృపాణమును నేర్పుగా విసరెను."

"కొలది క్షణములకుఁబూర్వమే నాదృష్టి గడ్డిమీఁదఁ బడి యున్న కత్తితునకలపైఁబడెను. అది యొక మర్యాదస్థుని కర వాలము. ఇంకొకచోట నొకపురాతనకృపాణము పడి యుండెను. అది యుద్ధవీరుని కరవాలముగా గోచరించెను."

"వైద్యశిఖామణీ! ఇప్పుడు నన్ను లేవదీయుఁడు. నన్ను లేవదీయుఁడు. అతఁడెక్కడ?"

"అతఁడు సీని సహోదరుని గూర్చి యడుగుచుండె నని గ్రహించితిని. వానిని లేవనెత్తుచు "నతడిచట లే"డని సమా ధానము చెప్పితిని."

"అతఁ డీ మిగిలిన జమీందారులవలెనే గర్వపోతు.అతఁడు నన్నుఁ జూచుటకు భయపడుచుండెను. ఇక్కడ నున్న వాఁడేడి? నా ముఖము నాతని వైపునకుఁ ద్రిప్పుడు."

"బాలు నాతని మోకాలుపై నెత్తియుంచి నేనట్లే గావిం చితిని. బాలుఁడు వానిని దూషించెను. వెంటనే క్రిందవ్రాలి మరణించెను."

"నే నా యువతి ప్రక్కదరి కరిగితిని. ఆమె యింకను నట్లే పలుకుచుండెను. ఇది యిట్లు మఱికొన్నిగంట లుండుననియు మరణము తోడనే సమాప్తి నొందుననియుఁ దలంచితిని."

"నేనామెను మొదటఁ జూచినప్పటినుండి యిఱువది యాఱుగంటలు గడచెను. నేను రెండుసారులువచ్చితిని, పోయి తిని. ఆమె తడఁబడునపుడు ప్రక్కనగూర్చుంటిని. నేను జేయగల

సాయమును జేసితిని. క్రమక్రమముగా నామె స్పృహపోయి మరణించెను.

"ఆమె చనిపోయెనా?"యని మార్క్వి సడిగెను.

"చావలేదు. చావనున్నది" యంటిని.

"ఈ సామాన్యజనుల శరీరములం దెంత పటుత్వ ముండు"నని యామెవంక నాశ్చర్యముతోఁ జూచుచు ననెను.

"శోక సమయమునందు, నిరాశయందు, నధికబల ముండు"నని నే నంటిని.

అతఁడు మొదట వికటముగా నవ్వెను. వారివంకఁ గుపితుడై పరికించెను. తనకాలితోఁ గురిచీని యీవల నాసమీ పమునకు లాగికొని రుద్ధకంఠముతో నిట్లనెను.

"వైద్యశిఖామణీ! ఈకుక్కల వలని కష్టమునకు లోన యిన నా సోదరునిగాంచి మీ సాయము తప్పక యపేక్షణీయ మని వానితో నంటిని. మీ రధికకీర్తిగలవారు. యువకు లదృష్ట మభిలషింతురు. సాధారణముగా మీ మేలును మీరు చూచు కొందురు. ఈయెడఁజూచిన సంగతులు చూడఁదగినవిగాని వానినిగూర్చి మాట్లాడఁదగినవి కావు."

నేను వినినదియుఁ గనినదియుఁ దలంచినపుడు మన స్సావేదన మొందుచుండెను. నేను సమాధానము చెప్పుట యందు జాగ్రత్తగా నుంటిని.

"అయ్యా! నాయుద్యోగమునందు రహస్యగోపనము, సహనము ముఖ్యావసరములని యంటిని.

రెండురోజుల కామె మరణించెను. వారు నాకు ధనము నీయవచ్చిరి. వారికడనుండి నేనేమియుఁగైకొన నిచ్ఛగింపలేదు.

వారు నాకుఁ బ్రణతి గావించిరి. నేనేమియు మాటాడలేదు. తిరిగి యింటికి వచ్చితిని.

మఱునాఁ డుదయమున వారు నాకుఁ జైకమును బంపిరి. దాని నేమిచేయవలయునో నాకుఁ దోఁచలేదు. మంత్రి కొక లేఖను వ్రాయ నిశ్చయించుకొంటిని. వారు దానిపై నెట్టి చర్యయుఁ గైకొనరని నాకుఁ దెలియును. వారికి రాజకూటము నందుఁ బలుకుబడికలదు. కాని నా హృదయభారము తొలఁ గించుకొనఁ గోరితిని.

మఱునాఁడు లేఖ పూర్తి చేసితిని. ఒక యువతి నన్ను దర్శింప వచ్చెను. మార్క్విస్ ఎవర్మాండి భార్య నని యామె నాకుఁ బరిచయ మొనరించుకొనెను. వెంటనే నా పేరు నా బాలుడా సోదరులలో నొకనిని సంబోధించిన నామమ్మును, 'ఇ' యను చేతిరుమాలు పీఠికమీఁది యక్షరమును గూర్చు కొంటిని.

ఆమె యాఘోరకథాభాగమును గొంత సందే హించెను. ముఖ్యాంశములను గనిపెట్టెను. ఆబాలిక మరణించె నని యామెకుఁ దెలియదు. స్త్రీలుసహజముగా దయాస్వభావలు. కాలమునుండియు జనుల యాపదలకుఁ గారణమైన తన వంశ మును దేవుని కోపమునకు గుఱిగాకుండ నొనరింపఁ దలఁచెను.

ఆమె కొకసోదరి కలదని తెలిసికొనెను. ఆమెకు సాయ మొనరింప నిశ్చయించుకొనెను. ఆమె నివాసమును పేరును దెలుపఁగోరెను. కాని నేనేదియుఁ జెప్పనైతిని.

ఆమె మంచిదయాస్వభావురాలు. ఆమె వివాహాము నకు సంతోషింపలేదు. ఆమె యెట్లు సంతోషింపఁగలదు.

అతని సోదరు డామెయం దసిష్టము నవిశ్వాసమును గలవా డయ్యెను. అత డనిన నామెకు భయ మధికము. భర్తయందును నట్టి భావనే కలదు. నే నామెను వీధిగుమ్మమునకును నంప డించితిని. అచట బండిలో నొక బాలుడు గలడు. అతనికి రెండుమూడేం డ్లుండును."

"అయ్యో! ఈ బాలుని కొఱకైనను నేను జేయగల సాయమును జేయుదును. లేనిచోః బైతృకమైన యాస్తి యం దతఁడు బాగుపడి యభివృద్ధికి రాఁజాలఁడు. నా స్వంత మని చెప్పఁదగినదానిలో నామె సోదరిని దెలిసికొనఁ గలిగినచో, బాధితమైన యామె సంసారమునకు నాశక్తికొలది జీవములఁ గుదువబెట్టియైన సాయ మొనరింతు"నని కన్నీటితోఁ బలికెను."

"ఆమె యా బాలుని ముద్దాడుచు 'నాయనా! నీకొఱకే యిదియంతయుఁ జేయుచుంటిని. చార్లెస్! నీవు విశ్వాసము కలిగి యుందువా' యనెను. ఆ బాలుఁడు "నిశ్చయముగా"నని ధైర్య ముతో సమాధానము చెప్పెను. నే నామెచేతిని ముద్దుపెట్టు కొంటిని. ఆమె యాబాలు నెత్తుకొని వెడలిపోయెను. మఱల నే నామెను గాంచలేదు."

"నే నామెభర్త నామ మెఱుగుదు నను నిశ్చయముతో నతని నామము నాకుఁ దెల్పెను. కాని నే నా పేరు త్తరము నందుఁ జేర్చలేదు. ముద్రవైచి నాయంతట నేనే యీ యుత్తరము మంత్రి కొసఁగితిని."

"నాటిరాత్రి తొమ్మిదిగంటల కొక మనుష్యుఁడు నన్ను దర్శించుటకు ద్వారముకడ గంటను మ్రోయించెను. నా సేవకు డగు డిఫార్జినివెంబడించి యొకయువకుఁడు మేడమీఁదికివచ్చెను."

"అయ్యా! బండి వేచియున్నది. ప్రమాదమగు రోగము, సెయింటుహోనరియందు. రావలయును. ఆలస్యముచేయరా"దని యాతడు వచించెను."

"అదియే నన్నచ్చటకుఁ గొనివచ్చినది. నా సమాధికి. నేను బైటికి రాగానే యొక గుడ్డ వెనుకనుండి నోటికిఁ గట్టి వేయఁబడెను. నా చేతులుబంధింపఁబడెను. వీధియందొక చీఁకటి మూలనుండి యా యిరువురు సోదరులు వచ్చిరి. మార్క్వీసు తన జేబునుండి నేను లిఖించిన యుత్తరమును దీసెను. నాకుఁ జూపి దీపపు వెలుఁగున దానిని దగులఁబెట్టెను. ఆనుసిని బాదము లతో నలిపివేసెను. ఒక మాటైనను బలుకలేదు. నన్నచటకుఁ గొనివచ్చిరి. నాసమాధికి."

"వారిని వారి వంశీయులను అలెగ్జాండరుమానటి నగు నేను దుర్భరమగు నా హృదయవేదనమున శపించుచుంటిని. ఈ ఘోరకృత్యములకు వారు త్తరవాదులు. ఇహపరములకు నింద్యులు.

పత్రముచదువుట ముగిసినంతనే భయంకరమగు ధ్వని యుద్భవించెను. ఆకథానిక కాలానుగుణమగు ప్రతీకారము నుద్బోధించెను. న్యాయసభ ప్రత్యేకముగా వ్యక్తిగతా భిప్రాయముల నెఱుంగఁదలపోయుచుండెను. సభ్యులహృదయము లావేశపూరితములయ్యెను. దేశభక్తి రగిలి జ్వాలాజ్వలితమగు చుండెను. మానవసహజమగు దయాభావ మంతరించెను.

వైద్యునకుఁ జుట్టుపట్టులందుఁ బలుకుబడి కలదు. "ఇప్పు డాతని గాపాడుము, వైద్యమణీ! కాపాడు''మని డిఫార్జి హేళ నగా నుడివెను.

ప్రతి న్యాయసంఘసభ్యుని వోటునకుఁ గలకలము తెచ్చి పోవుచుండెను. అందఱు నేకగ్రీవముగా నభిమతమును వ్యక్తీకరించిరి. హృదయమందు, వంశమునందు, ధనికస్వామ్యవాది, ప్రజాప్రభుత్వమునకు విరోధి. జనులను బీడించు విఖ్యాతుఁడు, 24 గంటలలో మరణము.

---

## తొమ్మిదవ ప్రకరణము

ఆ సాయంకాలము సిడ్నీకార్టను, డిఫార్జి సారాదుకాణమున కేగెను. లోని కరిగి చిన్నగ్లాసెడు ద్రాక్షారసము నొసంగఁగోరెను. అతఁడు ఫ్రెంచిభాష నెఱుఁగనటుల యాసగా నుచ్చరించుచుండెను. అదియుఁ దప్పులు.

"ఆంగ్లేయుఁడవా?" యని డిఫార్జిసతి ప్రశ్నించెను.

కార్ట నర్థము కానటుల నటించుచు నచ్చమగు నాంగ్లేయోచ్చారణపద్ధతిని సమాధానము చెప్పెను.

పిమ్మట నతఁడు కూర్చుండి ఫ్రెంచిభాషాపత్రికను దీసికొనెను. ఆ భాష రానివానివలెఁ జదువుచు నర్థమునకై తబ్బిబ్బుపడుచున్నటుల నటించెను.

దుకాణమునందు జాక్విసుమూడు, వెంజన్సు మాత్రము కలరు. ఫ్రెంచిభాష నెఱుఁగని నూతనునివలన నేయుపద్రవము రాఁజాలదని తలంచి వారు తమ సంభాషణను సాగించిరి.

"మంచిది, దేనికైనను నవధి యుండవలయు"నని డిఫార్జి యనెను.

"విచారణయే దానికవధి"యని భార్యయనెను. మిగిలిన

యిరువు రందులకుఁ దమ సమ్మతిని జూపిరి.

"కాని వైద్యుఁ డధికమగుబాధల ననుభవించెను. పుత్రిక విషాద మాతనికి భరింపరాని దగును."

"నీమీద నాధార మున్న చో నాతనిని రక్షింపుము."

"కాదు-నేనుగా"దని భర్త వారించెను. "ఆసంగతి యంతటితో నాపుదు నని యంటిని. అంతటిలో నాపుము."

"విను! బహుకాలమునుండియు వారి క్రూరత్వమునకు నా జాబితాలో నీ కులమువారి పేరులు లిఖించితిని. వారు విచారణకు, నాశనమున కర్హులు. నాభర్త నడుగుము. అట్లుకాదా?"

"అవును" అని డిఫార్జి పలికెను.

బాస్టయిలు లొంగిననాడు వైద్యుడు లిఖించిన పత్రమును జదివితిమి. ఆ రేయియే నా రహస్యమును జెప్పితిని. ఎవర్మాండిసోదరు లపకార మొనరించిన యా సంసారము నా సంసారము. ప్రమాదముగా గాయపడిన బాలుని సోదరి నాసోదరి. ఆమెభర్త నాసోదరిభర్త. ఆసోదరుఁడు నాసోదరుఁడు. ఆ తండ్రి నా తండ్రి. అతని నడుగుము. అంతేనా?"

"అవును."

"ఇంక నెక్కడ నాగవలయునో గాలికి నిప్పునకుఁ జెప్పుము. నాతోఁ జెప్పకుము."

"ఆమె భయంకరకోపాగ్నికి వినువారు సైతము నామెతో నేకీభవించిరి. కనికరింపఁ దగినదగు మార్క్విసుభార్యనుగూర్చి డిఫార్జి కొలఁదిమాటలాడెను. కాని యతనిభార్య మఱల నదే సమాధానము చెప్పెను."

"ఎక్కడ నాగవలయునో గాలికి నిప్పునకుఁ జెప్పుము."

నాకుఁగాదు."

కార్ట్ సారాదుకాణమునందువినినదానినిబట్టియుబార్సాడు చెప్పినదానిని బట్టియు, లూ్యసీని, యామె బిడ్డను జంపినగాని వంశనాశన మొనరింపఁ బ్రతిజ్ఞపట్టిన యామె పట్టుదల తుద ముట్టదని తలంచెను. ఆమె ఖైదునందున్న బంధితుని దప్పించు టకు బైటినుండి యత్నములు చేయుచున్నదని సాక్ష్యమీయఁ బడును. మఱియు నామె భర్తకొఱకు దుఃఖించును. అట్లు గాలటికి శిక్షార్హులను గూర్చి కనికరింమటకాని దుఃఖించుట గాని మహాదోషము.

కావునఁ గార్టను లారీ యొద్ద కరిగి తనకే కాక, లూ్యసికి నామె బిడ్డకు, మానటికి నాంగ్లేయన్యాయవాది కార్టనునకు ననుజ్ఞాపత్రములను సంపాదించి యుంచుకొనుటకు వేగిర పెట్టెను.

"సముద్రతీరమునకు సాధ్యమగునంత త్వరగాఁ బయనింప బ్రయాణసౌకర్యముల నేర్పఱచుకొనుటకుఁ బ్రయత్నములు ముగిసినవి. ఱేపు తెల్లవారుజామున గుఱ్ఱములను సిద్ధపఱుపుము. మధ్యాహ్నము రెండుగంటలకు నొక నెక్కవచ్చును."

---

## పదవ ప్రకరణము

అంధకారబంధురమగు కారాగృహమునందు బంధితు లభాగ్యదేవతా సమాగమమునకై యెదురు చూచుచుండిరి. డార్నే యా తుదిసాయంకాల ముత్తరములను వ్రాయుట యందుఁ గడపెను.

లూ్యసీ కొక దీర్ఘమగు లేఖను వ్రాసెను. అందు-ఆమె చెప్పునంతవఱకు నామెతండ్రి కారాగృహావాసమును గుఱించి యెఱుఁగనేయెఱుఁగననియుఁ దానామెవలెఁదనతండ్రిపినతండ్రుల దుర్ణయపత్రమును జదివి వినిపించునంతవఱకు నెఱుఁగననియు వ్రాసెను. అతఁడు తన నామమును బెండ్లివఱకు దాచియుంచుటకు హేతువును విశదీకరించెను. ఆమెజనకుని దుఃఖోపశమనంబు గావింపుమని ప్రార్థించి, బిడ్డనుదీవించి, యుత్తరమును ముగించెను. అతఁడు కార్టనునుగూర్చి తలంపలేదు. వాని హృదయము ప్రధానమగు నితరాలోచనలతో నిండిపోయెను. కావున వానినిగూర్చి తలంచుటకైనను సావకాశము కలుగలేదు.

శిరచ్ఛేదములు తెల్లవారుజామున మూఁడుగంటలకు నిశ్చయింపఁబడెను. బండ్లు మందగమనమున వీథివెంట నరుగ వలయును. కాని నేరస్థులు రెండుగంటలకు ఖైదునుండి బయలు దేరుదురు.

ఒంటిగంట యైనది. బైట ద్వారము వెలుపల రాతినేలపై నడుగులచప్పుఁడు వినిపించెను.

తాళమునందుఁ జెవియుంచి త్రిప్పఁబడెను.

త్వరగాఁ దలుపు తెఱువఁబడెను. మఱల మూయఁ బడెను. చిఱునవ్వుకాంతితో డార్నే ముందుఁ గార్టను నిలుచుండెను.

అతనిచూపునందు రూపమునందును వింతకాంతులు పొడచూపెను. అతఁడొక భూతమని డార్నే తలంచెను. కాని యతఁడు మాట్లాడెను. అది వాని కంఠస్వరమే. అతఁడు ఖైదీ చేతిని బట్టుకొనెను. అది వాని పిడికిలియే.

"భూమిపైఁగల మానవులలో నన్ను నీవు చూడఁదలంచి యుండ"వని కార్టను నుడివెను.

"నీవని నేను నమ్మఁజాలనైతిని. ఇప్పుడు నేను గొలదిగా నమ్ముచుంటిని. నీవు బంధితుడవు కావు."

డార్నే హృదయము హఠాత్తుగా భయకంపితమయ్యెను.

"కాదు, ఇచ్చటి రక్షకులలో నొకనిమీద నాకొక శక్తి యదృష్టవశమున సంఘటిల్లెను. దానిమూలమున నీ ముందు నిలువఁగలిగితిని. నీ భార్యయొద్దనుండి వచ్చితిని. ఆమె యొద్దనుండి యొక వేడికోలును దెచ్చితిని."

"అదేమి!"

ఆ బంధితుఁడు తనముఖమును గొలఁదిగాఁ బ్రక్కకు ద్రిప్పుకొనెను.

"నే నేల యది గొనివచ్చితినో, యదియేమో, చెప్పుట కిప్పుడు నావకాశములేదు. నన్నుఁ బ్రశ్నింపక నాయాన చెల్లింపవలయును. నీవు ధరించు పాదరక్షలను విప్పుము. నావి ధరింపుము."

ఆ గదిగోడకడ బంధితునివెనుక నొక కుర్చీకలదు. కార్టను దానిని ముందునకు బలవంతముగా లాగి మెఱపువేగముతోఁ గుర్చీయందుఁ గూర్చుండఁబెట్టెను. అతనిదగ్గరగా రిక్త పాదములతో నిలుచుండెను!

"నా పాదరక్షలను ధరింపుము. త్వరగా."

"కార్టన్! ఈ కారాగారమునుండి తప్పించుకొనుటకల్ల. అది జరుగదు. నాతో నీవు మరణింపఁగలవు. ఇది పిచ్చిదనము."

"నిన్నుఁ దప్పించుకొని పొమ్మని నేనందునేని యది పిచ్చి

తనమగును. కాని నేనట్లంటినా? నీపాదరక్షలను నావానితో మార్పుము. నీకోటు నాకోటుతో మార్పుము. నీ వది చేయు చుండగా నీజుట్టునుండి రిబ్బనును విప్పనిమ్ము. నీ శిరోజములను నా శిరోజములవలె విదలింపనిమ్ము."

వింతయగు వేగముతో నమానుషముగా గోచరించు మనోనిశ్చయముతోడిపనులతో నీ మార్పులన్నియు బలవంత ముగా నొనరించెను. బంధితుఁడాతనిచేతియందు బాలుఁడయ్యెను.

"కార్టను! ప్రియమగు కార్టన్! ఇది పిచ్చితనము. ఇది జరుగునది కాదు. దుస్సాధము.ఇట్టిది ప్రయత్నించి విఫలులైరి."

"నీవు తప్పించుకొని పొమ్మని యింకను సలహా నిచ్చుట లేదు. నేను జెప్పునది వ్రాయుదువా?"

డార్నే మేజాబల్లయొద్దఁ గూర్చుండెను. కార్టనుదగ్గర నిలుచుండెను. ఏదో లేఖకుని ముఖసమీపమునఁ బట్టుకొని యుండెను. ఒకనిమిషములోఁగలము చేతినుండి జారెను. అతఁడు చుట్టును శూన్యహృదయుఁడై చూచెను.

"ఈయావిరి యేమి?"

"ఆవిరియేమియు లేదే. ఇచ్చట నేమియుఁ గాన్పించుట లేదు. కలముతీసికొని పూర్తిచేయుము. త్వరగా కావలయును.

ఖైదీశక్తియంతయుఁ బటాపంచ లగుచుండెను.అతఁడుతన శక్తినిఁగూడఁదీసికొనుటకై ప్రయత్నించెను.అతఁడు కార్టనువంకఁ జూచెను. కన్నులు మేఘావృతములయ్యెను. దృష్టి గోచరించుట లేదు. ఉచ్ఛ్వాసనిశ్వాసములు ప్రయాసముగా నొదవు చుండెను.

'త్వరగా, త్వరగా!'

ఖైదీ కాగితముమీఁది కింకొకమాఱు వంగెను. కార్టనుతన చేతిని డార్నే నాసికపై హఠాత్తుగా నుంచెను. ఆమందు త్వరగాఁ దనపని జేసెను. డార్నే తనజీవితమును సమర్పింప నరుదెంచిన యీ మానవునితో క్షణకాలము పెనఁగులాడెను. కాని మఱుక్షణము స్మారకము లేక నేలమీఁదఁ బడిపోయెను.

కార్టను ఖైదీదుస్తులను త్వరగా ధరించెను. తనజుట్టును వెనుకకు దువ్వి ఖైదీధరించిన రిబ్బనుతో బంధించెను. పిమ్మట మెల్లగా 'లోనికిరమ్ము' అని యనెను. వేఁగులవాఁడగు బార్సా యెదుటి కరుదెంచెను.

'చూచితివా! నీకుఁ బ్రమాదము కలిగెనా?'

"కార్టనా! నీవు నీమాట నిలుపుకొనినచోఁ బ్రమాదము రాదు."

"భయపడకుము. నీ ప్రయాణమార్గమునుండి నేను త్వరగాఁ దొలఁగిపోఁగలను. మిగిలినది త్వరలోనే దూరమగును. దైవమును సంతోషపెట్టుము. నన్నిప్పుడు సహాయము గొని వచ్చిన బండిలోని కెక్కింపుము."

"నన్నా?"

"వానినే! నేను దుస్తులు మార్చుకొనిన వానిని. నీవు నన్నుఁ గొనివచ్చిన మార్గముననే బైటికేగుము."

"అట్లే."

"నీవు నన్నుఁ గొనివచ్చినపుడు బలహీనముగను నిస్సారముగా నుంటిని. ఇప్పుడు మఱింత నిస్సారమయితిని. అతని వియోగము తలకు మించెను. ఇక్కడ నిట్టియాపద తటస్థించెనని తెల్పుము. నీప్రాణము నీచేతియందున్నది. త్వరగా!

సహాయమునకై యెవరినైనఁ బిలువుము. బహిరంగ ప్రదేశమునకుఁ గొనిపొమ్ము. వీనిని బండియం దుంచుము. నీవు లారీకిఁ గనపడుము. వానితో వీనికేచికిత్సయుఁ జేయించక చల్లని గాలియం దుంచుమనుము. క్రిందటిరేయి నామాటలు జ్ఞప్తియం దుంచుకొను మనుము. ఇంకఁ గదలి పొమ్ము.''

వేఁగులవాఁడు వెడలిపోయెను. కార్టను తననుదురును జేతులం దుంచుకొని మేజాబల్లయొద్దఁ గూర్చుండెను. వేఁగుల వాఁడు వెంటనే యిరువురు మనుష్యులతోఁ దిరిగివచ్చెను. వా రా విస్మృతజీవిని లేపి యొకమంచముపై నుంచుకొని తీసికొని పోవుటకు వంగిరి.

"ఎవర్నండి! కాలము సమీపించినది"యని వేఁగు కార్టనుతో గుసగుసగా ననెను.

"నాకు బాగుగాఁ దెలియును. నా మిత్రునిగూర్చి జాగ్రత్తగానుండుము. నన్ను నాకు విడిచిపెట్టు"మని కార్టను నుడివెను.

"మిత్రులారా! యింకరం"డని బార్సాడ ననెను. తలుపు మూయఁబడెను. కార్టన్ నొంటరిగా నుండెను. ప్రమాదము తటస్థించునేమో యని ప్రతిశబ్దమును వినుచుండెను. ఏమియు లేదు. తాళపుచెవి త్రిప్పఁబడెను. తలుపులు మూయఁబడెను. అడుగులచప్పుడు దూరమయ్యెను. విపరీతమగు కేకగాని తొందరగాని వినిపించలేదు. కొలఁదిసేపటిలో స్వేచ్ఛగా నిశ్వాసము తీసికొని మేజాబల్లయొద్దఁ గూర్చుండెను. గడియారము రెండు కొట్టునంతవఱకు వేచియుండెను.

అప్పుడు వినిపించు శబ్దములకు భయపడలేదు. అతనికి

వానియంతరార్థము తెలియును. తలుపువెంబడి తలుపు వరుసగాఁ దెఱువఁబడెను. చివరకుఁ దనది. ఒక కారాగృహపాలకుఁడు తనచేతిలో జాబితాను బట్టుకొని లోనికిఁజూచెను. "ఎవర్యాండి! నన్ననుసరింపు"మనెను. అతఁడు వానివెంట దూరమున నున్న యొక విశాలమగు చీఁకటిశాల కరిగెను. అది శీతకాలమురాత్రి. చీఁకటిగానుండెను. అక్కడికిఁ జేతులు బంధించి కొనివచ్చిన వారలను గుర్తింపరాకుండెను. కొందఱు నిలుచుండిరి. కొందఱు కూర్చుండిరి. కొందఱు నిరంతరము శోకించుచుండిరి. కాని దుఃఖించువారు కొలదిమంది మాత్రమేకలరు. కొలఁదిసేపటిలో నొకయువతి నచటకుఁగొనివచ్చిరి. ఆమె రూపమునందు బాలిక వలె నుండెను. అందమగు ముఖము, కాని వికాసవిరహితము. ప్రశాంతమగు కన్నులు. తన చోటినుండి లేచి యాతనితో మాట్లాడవచ్చెను.

ఆమె తన శీతలహస్తముతో స్పృశించుచు, "ఎవర్యాండి! నేనభాగ్యురాల నగు దర్జీదానను. లాఫోర్సు కారాగృహము నందు నీతో నుంటిని.''

అతడు సమాధానము చెప్పుటకు గొణిగెను. "నిజము. నీ వే నేరముమీద బంధితవైతివో మఱచితిని.''

"పన్నాగములకు. అందలి సత్యాసత్యములను దైవ మెఱుగును. వానికే నా నిరపరాధిత్వము తెలియును. నేనంతకు సమర్థురాలనా? నావంటి యభాగ్యురాలగు బలహీనురాలితోఁ బన్నాగము లెవరు కావింతురు?"

ఆమె మాట్లాడిన పలుకుల వైఖరి కాతని కన్నులనుండి నీరు దొర్లెను.

"నేను మరణమునకు భయపడుచుండుట లేదు. ఎవర్మాండి! నా మరణము బీదలకు లాభకర మగునేని జనుల కుపకారము గావింపనున్న ప్రజాప్రభుత్వము కొఱకు నేను మరణింప సిద్ధముగా నుంటిని. అది యెట్లో నాకుఁ దెలియదు. ఎవర్మాండి! అభాగ్యురాల నగు వ్యక్తిని."

"నీవు విడుదల చేయఁబడితి వని తలంచితిని. ఎవర్మాండి! అది సత్యమని యూహించితిని."

"సత్యమే! మఱల శిక్షింపఁ బడితిని."

"నన్ను నీతోఁ గొనిపోవుదు రేని, ఎవర్మాండి! నీచేతిని బట్టుకొన నిత్తువా? నేను మరణమునకు భయపడికాదు. చిన్న దానను. బలహీనురాలను. నాకది మఱింత ధైర్యము కలిగించును."

ఆమె తన ప్రశాంతదృష్టుల నాతనిముఖముపైఁ బఱపించెను. ఆచూపులలో హఠాత్తుగా సందేహము గోచరించెను. ఆశ్చర్యము ముప్పిరిగొనెను. డార్నే కాఁడని యామె గుర్తించె నని కార్టను గ్రహించెను. కేకలు వేయకుండ నామె చిన్నవ్రేళ్ల నొత్తుచు పెదవిని జేతితో స్పృశించెను.

"నీ వాతనికై మరణించుచుంటివా" యని యామె మెల్లగా ననెను.

"అతని భార్య, బిడ్డల కొఱకును, చాలు."

"నీ ధైర్యమగు చేతినిఁ బట్టుకొననిమ్ము. నూతనుఁడా!"

"మాటాడకుము. సరే. నా మిత్రురాలా! చివరివఱకు.

* * *

అదేసమయమునఁ బండి కోటకడకుఁ దోలుకొని రాఁబడెను. ప్రయాణానుమతిపత్రములు చేతి కందీయఁబడెను.

అలెగ్జాండరు మానటి వైద్యుఁడు-ఫ్రెంచిదేశీయుఁడు-ల్యూసీ-ఆమెబిడ్డ-ఆంగ్లేయులు. సిడ్నీ కార్టను - ఆంగ్లేయుఁడు, న్యాయవాది. జార్విసులారీ-బ్యాంకరు. ఆంగ్లేయుఁడు.

ఆంగ్లేయన్యాయవాది యపస్మారకమం దుండెను. విచారణ తృప్తికరముగా నున్నది. బండి ప్యారిసును దాటిపోయెను. మొదటి ప్రమాదము తప్పెను.

---

## పదునొకండవ ప్రకరణము

ఆ సమయముననే ప్యారిసున నింకొకభాగమున మఱియొక సంఘటనము తటస్థించెను. డీఫార్జిసతి, వెంజెన్సు, మూడవ జాక్విసులతో సారాదుకాణమునందు నొక అంపపుకోఁతవాని గుడిసెయందు పర్యాలోచించుచుండెను. అంపపుకోఁతవాఁడు పూర్వము రోడ్లు బాగుచేయు వృత్తియం దుండెను.

'నాభర్త యుత్తమ ప్రజాస్వామ్యవాది. ధైర్యసాహసములు గలవాఁడు. ప్రజాప్రభుత్వమున కాతనియందు విశ్వాసమధికము. కాని యతనియందు లోపములు కలవు. వైద్యుని గూర్చి నాకంత పట్టుదల లేదు. ఆయన వైద్యునియందు దయాదరములు కలుగుటకు నే నననూ, దానికి నే నే యాటంకముఁ జెప్పను. కాని యెవర్మోండివంశవినాశమునకు నా వాదము నాదరింపకుండెను. కాని యావంశము కూఁకటివ్రేళ్లతో నశింపవలయును. భార్యయు బిడ్డయుఁ దండ్రి ననుగమింపవలయును.

ఈఅంపప్రొతవాడు ఖైదీలకు సంజ్ఞలు చేయుచుండగాఁ జూచితి నని సాక్ష్యమొసంగుటకు వాగ్దానము గావించెను. ఈ సాయం కాలమే వారిని బంధింపవలయును, లేదేని దప్పించుకొని పోవుదురు."

ఇట్టి రక్కసిజిత్తులను మనసునం దుంచుకొని తన వాద మును బలవత్తరము కావించుకొన నెంచి యామె భర్తను మృత్యు ముఖమునఁ బడద్రోసిన ప్రభుత్వమునుగూర్చియామెపలుకుమాట లను దెలిసికొనవలయునని డిఫార్జిసతి ల్యూసీగృహమున కరుగ నిశ్చయించుకొనెను.

"ఆమె భర్తమరణమును బ్రతీక్షించుచు నిపు డింటి యొద్ద నుండును. శోకాతిశయమున విలపించుచుండును. ప్రజా ప్రభుత్వపు తీర్పులను దూషించుచుండును. ప్రభుత్వవిరోధుల యెడ నాదరము కలదై యుండును. నే నామెకడ కరిగెదను."

"సన్మతిపాత్ర మగు నూహ"యని జాక్వేసు మూఁడ నెను.

'నా యల్లికను దీసికొని గాలటినునొద్ద నా యథా స్థానమున సిద్ధముగా నుంచుము. నీ వక్కడికిఁ దిన్నఁగా నరు గుము. ప్రతిదినముకంటె నే డధికసమూహ మరుదెంచు" నని డిఫార్జిసతి వెంజన్సుతో స నెను.

"ఆలస్యము చేయవుకదా ?"

"మృత్యుశకటములు రాకమునుపే నే నచటికి వత్తు" నని నుడివి వీథిలోని కరిగెను.

భయంకరమగు కాలగతులకుఁ జిక్కి మానవులను జిత్ర వధార్హులఁ గావించిన నారీపిశాచము లనేకులు కలరు. కాని యీ బాటవెంట నరుగు నీ నారీరాక్షసివంటి దొక్కతైన వారి

యందుఁ గానరాదు. నిర్భయమగు హృదయము, ప్రజ్ఞామయ మగు బుద్ధి, సూక్ష్మమగు గ్రహణశక్తి, ఘనమగు నిశ్చయశక్తి కలది. కాని యామె బాల్యమునుండియు నలవాటైన దురాలోచనలు, ధనస్వామికవాదులయందు వైరము, నామెను గాలానుగుణముగాఁ గ్రూరస్వభావ మగు బెబ్బులిగా మార్చెను. ఆమెకు దయాదాక్షిణ్యములు లేవు. ఏమయిన మంచి స్వభావ మెక్కడనైనఁ గలదేని యదియు నశించెను.

పితృపితామహుల పాపకార్యములకు నేమియు నెఱుఁగని యమాయకుని మృత్యుముఖమునకుఁ ద్రోయుట యామెకుఁ జీమ కుట్టినట్లైనను దోపదు. వానియం దాతనినిగాదు, వాని పితృపితామహులను గాంచును. అతనిభార్య విధవరాలయినను, బిడ్డ మాతాపితృవిహీనయైనను నామెకు లక్ష్యములేదు. ఆ శిక్ష యామెదృష్టిలో వారికి దక్కవగాఁ గోచరించును. వారామెకు సహజవైరులు. వారికి జీవించుట కర్హతలేదు.

అట్టిహృదయ మామె దుస్తులచే నాచ్ఛాదితమైయుండెను. ఎఱ్ఱనిటోపీనుండి యామె విసీలకుంతలములు సుందరముగా నగుపించుచుండెను. ఆమె వక్షమునందుఁ జిఱుతుపాకిని గుప్తమొనరించుకొనెను. చిఱుకోటునందు రహస్యముగాఁ జిఱుకత్తిని దాల్చెను. అట్లు సాయుధయై డిఫార్జిసతి వీధివెంట బయలుదేరెను.

అప్పుడే శకటమ్ము కోటకు బయలుదేరుచుండెను. క్రిందటిరేయి ప్రాసును దమవెంటఁ గొనిపోవుట యందలి కష్టమునుగూర్చి లారీ విచారించెను. శకటము నధికభారవహము కావింపకుండుట యుక్తమగుటయే కాక, బాటసారుల విచారణకు

నధిక కాలము వ్యయపఱుపకుండుట ప్రధానవిషయము. ఇటు నటుఁ గొలదినిమిషములు గడపినను వారికిఁ బ్రమాదము వాటిల్లఁ గలదు. కడకు జెట్టి, ప్రాసులు మధ్యాహ్నము మూడుగంటలకుఁ దేలిక శకటముపై నచ్చుట యుక్తమని నిర్ధారణ చేయఁబడెను. వస్తుసామగ్రుల భారము లేకుండుటచే వారు ముందు బండిని సులువుగాఁ గలిసికొనగలరు. రాత్రిప్రయాణమందు దాలస్యము ప్రమాదకరము.

ఈ సదుపాయమునందుఁ దన యజమానునకు సేవచేయు నావకాశము కలిగెనని ప్రాసు మిగుల సంతోషముతో సమ్మతించెను. ఆమెయు జెట్టియు బండి బయలుదేరుటఁ జూచిరి. కారాగృహమునుండి పాలమర్ గొనివచ్చిన మనుష్యుని గుఱించి, పదినిమిషములు విచారముతోఁ గడపిరి. అనంతరము వారిని వెంబడించి తమ ప్రయాణ యత్నములను బూర్తి గావించుకొనుచుండిరి. ఇంతలో డిఫార్జిసతి క్రమక్రమముగా వారి బసకు సమీపించుచుండెను.

"జెట్టి! ఈ బసనుండి మనము బయలుదేఱకుండుటచే నేమి తటస్థించునని తలంతువు? ఇంకొక శకటముకూడ నీ దినమిచటనుండి యరుగుటచేఁ గొంత సందేహమునకుఁ గారణమగును."

జెట్టి యామె యభిప్రాయమునకుఁ దలయూచెను. అతఁడు సుంకపుటింటికడకుఁ బనిమీఁద బయలుదేరెను. మూడు గంటలకు గుడియొద్దఁ గలసికొందునని నుడివెను.

పదినిమిషములు గడచెను. తెఱచిన తలుపునొద్ద డిఫార్జిసతినిగాంచి ప్రాసు భయపడెను.

డిఫార్జిసతి యామెవంక నిరాదరముగా నరసెను. 'ఎవర్మాండిభార్య యెచ్చట నున్నది' యని యడిగెను.

తలుపులన్నియుఁ దెఱచి యుండెను. వారు తప్పించు కొనిపోయినసంగతి గ్రహించునని ప్రాసు ఊహించెను. ఆమె మొదటఁ దలుపులన్నియు మూసెను. నాల్గు గదులు కలవు. వాని నన్నిఁటిని బంధించెను. లుూసీ వసించిన గది ముం దామె నిలిచెను.

డిఫార్జిసతి విసీలకనీసిక లామె శరవేగమునఁ జేయుచున్న కార్యమును వెంబడించెను. ముగించిన తరువాత నామె నిశ్చల దృష్టితోఁ బరికించెను. ప్రాసుకన్య యా వంశమునకు విశ్వాసార్హురాలని యామెకుఁ దెలియును. డిఫార్జిసతి యా వంశమునకు గర్భశత్రు వని ప్రాసునకుఁ దెలియును. ఆమెయుఁ బట్టుదలగల యువతి.

"దారి వెంబడిఁ జనుచు నామెకు నాయభివందనములు సమర్పింప వచ్చితిని. ఆమెను జూడఁగోరుచుంటి"నని డిఫార్జిసతి యనెను.

"నీ యభిప్రాయము క్రూర"మని ప్రాస నెను.

వా రిరువురుఁ దమ తమ స్వభాషలయందు మాటాడు చుండిరి. ఒకరి నొక రర్థముచేసికొనలేదు. ఇరువురు జాగ్రత్తగా నుండిరి. భాష తెలియకపోయినను జూపులు, చర్యలు, వారిభావమును వ్యక్తీకరించుచుండెను.

"నే నామెను జూడవలయును. నే నామెను జూడవలయునని యామెతోఁ జెప్పుము. లేదా, దారి కడ్డములెమ్ము. లోనికిఁ బోనిమ్మ"ని కుడిచేతి నూగించుచు డిఫార్జిసతి యనెను.

"నీ యర్థశూన్యమగుభాషను నే నర్థముచేసికొన నించుకైనను దలంపను. నిజమునుగూర్చి సందేహించినను నీ వెఱుఁగవలసిన దంతయు నీకుఁ జెప్పెదను."

వా రొండొరుల ముఖములందుఁ బ్రసరించుచున్న తీక్ష్ణవీక్షణముల నొక్కరైనను మఱల్పలేదు.

డిఫార్జిసతి యింతవరకు ప్రాసు తన్నుఁ జూచినప్పుడు నిలుచున్న చోటనుండి యొక్కయడుగైనను గదలలేదు. ఇప్పు డొకయడుగు ముందునకువైచెను. తరువాతఁ వైద్యుని, ఎవర్మాండి భార్యను గొంతెత్తి పిలిచెను.

"ఈ దుశ్చరితురాలుగాక డిఫార్జిసతికి సమాధానము చెప్పువారులేరా" యనెను.

లోపలనుండి యెట్టి సమాధానము రాలేదు. అందు మూలమున నామెకు వారు తప్పించుకొనిపోయి రను సందేహము జనించెను. మూఁడు గదితలుపులను తెఱచి చూచెను.

ఆ గదులన్నియుఁ జెల్లాచెదరుగా నుండెను. త్వరగా సామానులను కట్టగట్టిన గుర్తులు కన్పించుచుండెను. అచట నచట నా యా వస్తువులు విడిచిపెట్టఁబడెను. "నీ వెనుక నా గదియందెవరును లేరా! నన్నుఁ జూడని"మ్మని డిఫార్జిసతి యనెను.

"చూడనీయ"నని ప్రాసు వెంటనే సమాధానము చెప్పెను.

"వారా గదియందు లేనిచోఁ బోయినట్లే-వెంటనే వెంబడించి మఱలఁ దీసికొని రావచ్చు"నని డిఫార్జి తలఁచెను.

"వా రీ గదియం దున్నది లేనిది నీకుఁ దెలియనంతవఱకుఁ

నీ వొనరింపవలసినదానినిఁగూర్చి నీకు సందేహముగా నుండును. నీ కా విషయ మెఱుఁగకుండ చేయగలుగుదునేని నీవు తెలిసికొనఁ జాలవు. నీకుఁ దెలిసినను దెలియకపోయినను నే నిచట నిన్నాపినంతకాలము నీ విచటినుండి దాటిపోలేవు. ఏకాంతమగు నావరణయందు మేడమీఁద మన మున్నటిమి. మనల నెవరు విననేరరు. నిన్నిచట నాపుటకు శరీరశక్తి నొసంగ దేవుని బ్రార్థింతును. నీ విచ్చటనున్న ప్రతిక్షణము నాబిడ్డకు వందవేలు."

డిఫార్జిసతి తలుపునొద్దకు వచ్చెను. ప్రాసామె నడుమును రెండుచేతులతో బంధించి గట్టిగాఁబట్టుకొనెను. కొట్టుటకుఁగాని పోట్లాడుటకుగాని డిఫార్జికి దుస్సాధమయ్యెను. డిఫార్జి గింజుకొనెను. ప్రాసు డిఫార్జిని గట్టిగాఁ బట్టుకొని పైకి లేవనెత్తెను. డిఫార్జి తనచేతులను వదలించుకొని యామె ముఖమును రక్కెను. ప్రాసు వెంటనే తనతలను వంచి నడుమును మఱింత గట్టిగాఁ బ్రవాహములో మునిగిపోవువానివలెఁ బట్టుకొనెను.

వెంటనే డిఫార్జి నడుమునను్న చుఱకత్తికై తడుముకొనుచుండెను. "నా చేతుల క్రిందనున్నది. దానిని బైటికిఁ దీయనీయను. నేను నీకంటె బలవంతురాలను. దేవునికి నేను గృతజ్ఞురాలను. నీవో నేనో మరణించువఱకు నాపట్టు విడువను."

డిఫార్జిసతి చేతులు వక్షమునం దుంచుకొనెను. ప్రాసు పైవంకఁజూచెను. ఆమెవక్షమున నున్న చిఱుతుపాకిని జూచెను. ప్రాసు దానిని బైకిఁగొట్టెను. తత్క్షణమే భయంకరధ్వనితో

ధూమపటలము వెడలెను. ఆమె పాదములచెంత డిఫార్జిశరీరము విగతజీవమై పడిపోయెను.

జెర్రీతో ప్రాసు బండిలో పారిసునగరము వెలుపలకుఁ బోవుచుండగా నొకమాటయైన నామెకు వినిపించలేదు. నేరస్తులను మృత్యుముఖమునకుఁ గొనిపోవు శకటములు ప్రక్కనుండి యరుగుచున్నను నామెకు వినరాలేదు.

"ఆమె యీ భయంకరశకటధ్వనులు వినఁజాలనిచోఁ బ్రపంచమున నింకేమియు వినఁజాలదని నా యభిప్రాయ"మని జెర్రీ యనెను.

ఆమె నిజముగా నేదియు వినఁజాలకపోయెను. తుపాకి ముఖమునకు రెండంగుళముల దూరములోఁ బ్రేలుటచే నామె చెవిటి దయ్యెను.

---

## పంద్రెండవ ప్రకరణము

ఆనాడే పదిమంది దురదృష్టవంతులగు ఖైదీ లారు శకటములందుఁ గొనిపోఁబడిరి. ఆ బండ్లు మిట్టపల్లములుగల బాటవెంట నధికసమ్మర్దముతో నరిగెను. ఇరుప్రక్కల నాశ్వికులగు రక్షకభటు లరుదెంచుచుండిరి. జనసముదాయము వారిని 'ఎవర్మోండి యెవ' రని ప్రశ్నించుచుండిరి. సిడ్నీకార్టను మూఁడవ బండి తుదఁ దలవంచుకొని కూర్చుండెను. అతఁడు ప్రక్కనున్న కన్యతో మాట్లాడుచుండెను. అతడు చుట్టున నున్న దృశ్యములను లక్ష్యపెట్టక యామెతో నిరంతరముఁ మాటాడుచుండెను. జనులు 'ఎవర్మోండి నశించునుగాఁక!

ధనికస్వాములు వధ్యస్థానమునకుఁ బంపబడుదురుగాక" యని కేకలు వేయుచుండిరి. ఆ మాట లాతనికిఁ దగిలినటు లైనను లేవు.

వధ్యస్థానమునకు ముందు కుర్చీ కలదు. ప్రదర్శనము లందువలె నసంఖ్యాకులగు యువతులు కుట్టుకొనుచుఁ గూర్చుండిరి. ముందు కుర్చీలలో వెంజన్సు కూర్చుండెను. ఆమె తన మిత్రురాలికై యెదురు చూచుచుండెను.

"ఆమె యేది? డిఫార్జి యెక్కడ? ఎవరైనను నామెను జూచితిరా?"

"ఆమె యెన్నడు నింతకుముందు రాకుండఁబోలేదు." అని యొక యువతి యనెను.

"ఇప్పుడును రాకమాన" దని వెంజన్సు అనెను.

"ఆమె యెక్కడ?"

"బిగ్గరగాఁ బిలువుము."

వారెంత బిగ్గరగాఁ గేకలిడినను లాభములేదు. క్రూరురాలగు డిఫార్జి యింకఁ దిరిగి రాఁజాలదు.

శకటము లరుదెంచెను. వధ ప్రారంభమయ్యెను. స్త్రీలు ఖండింపఁబడిన ప్రతిశిరమును లెక్కపెట్టుచుండిరి.

మూడవశకటము పాంథులను దింపెను. కార్టను దర్జీ కన్య చేతి నింకను బట్టుకొని యుండెను. అతఁ డామెను వధ్య యంత్రముపై వెల్లకిలగాఁ బరుండబెట్టెను. ఆమె యాతని ముఖమును ధైర్యముతో నుపలక్షించుచుండెను. అతని యుప కారమునకుఁ గృతజ్ఞత వెల్లడించెను.

"వినూతనుఁడా! నీవు లేకుండిన నంత సంతోషముతో

నుండెడిదాననుగాను. నేను హృదయదౌర్బల్యముగల చిన్ని బాలికను. దైవము నాకడకు నిన్నుఁబంపె" నని యాబాలిక యనెను.

"బిడ్డా! కాదు, నీవే నా కడకుఁ బంపఁబడితివి. నీ దృష్టిని నాపై నుంచుము, ఇంక దేనిని మనమునఁ దలఁపకుము'' అని కార్ట నెను.

'నేను నీ చేతినిఁ బట్టుకొని యుండఁగా నింక దేనిని లక్ష్యము చేయను. త్వరగా జరిగినచో నా తల పోయినను లక్ష్యముచేయను.''

"భయపడకుము. త్వరగానే జరుగును."

వధార్హులు తఱిగిపోయిరి. గుంపు పలుచనయ్యెను. ఆమె వంతువచ్చెను. ఆమె యతని పెదవులను ముద్దుపెట్టుకొనెను. అతఁడామెను ముద్దుపెట్టుకొనెను. ఆమె చిఱుహస్తముల నాతఁడు విడిచినపుడు వణకలేదు. చివరి వఱకు నామె ముఖమునందు ధైర్యముతో నుండెను. స్త్రీలు 22 లెక్కించిరి.

ఆ జనసమ్మర్దము నడుమ నతఁడామె ననుగమించెను. అతని ప్రాణము మెఱుపువలె మెఱసెను.



